# తారాశశాంకం

[నాటకం]



రచయిత:

కొప్పరపు సుబ్బారావు

'రోషనారా' 'నేటినటుడు' 'నూర్జహాన్' 'వసంతసేన'

ఇత్యాది నాటక రచయిత.



ప్రకాశకులు

ది మోడరన్ పబ్లిషర్సు, (రిజిష్టర్డు)

హెడ్డాఫీసు — తెనాలి

వెల :

ఒక రూపాయి పన్నెండు అణాలు.



బెజవాడ శ్రీ రాజరాజేశ్వరీ నాటకమండలివారగు

శ్రీయుత పి. సూరిబాబు — శ్రీమతి పి. హెచ్. రాజేశ్వరీ

తప్ప

ఇతరులు ఎవ్వరూ ఈ నాటకాన్ని ప్రదర్శింపరాదు.

చతుర్థ ముద్రణము — మార్చి 1956





ESWARA PRINTING PRESS, TENALI.

# సమీక్ష

చిరంజీవి పి. సూరిబాబు కోరగా ఈ నాటకం వ్రాశాను. దీని తొలిప్రదర్శనం ఏలూరులో 1944 సం॥ అక్టోబరు 29 వ తేదీని జరిగింది. మొదటి అయిదు నెలలు కాల పరిమితిలోనే ఈనాటకం నలభైఆరుసార్లు ప్రదర్శితమైంది. ఈనాటకం ఇంత త్వరలో ఇంత ఘనామోదాన్ని పొందగలుగుటకు ముఖ్యకారణం ఏమన్నగా—దీన్ని ప్రదర్శించుటలో సామాజికులుచూపిన కొత్తదనం-ఉత్సాహం, శ్రద్ధ, కట్టుబాటు, సమిష్టిసహకారం (Team Work), ఉచిత రంగాలంకారాలు, అన్నిటికంటే ప్రశంసనీయమైనటువంటి క్రమశిక్షణ.

నేటి చాల కిరాయినటులు 'కాంబినేషన్' అనే పేరుతో అరాజకంగా ఆడుతూ ఉన్న ఆరోచకపు ప్రదర్శనాలను చూచిచూచి, విసుగెత్తివున్న ప్రేక్షకలోకాన్ని ఈ కొత్తదనం పూర్తిగా ఆకర్షించింది. ఇందుకు చిరంజీవులు పి.సూరిబాబు, సి.హెచ్.రాజేశ్వరి కళాప్రియుల మన్ననలకు అత్యంతము పాత్రులు.

కళానైపుణ్యంలో మన ఆంధ్ర నటీనటులు ఏ ఇతరరాష్ట్రీయ నటీనటులకూ తీసిపోరు. కాని, మననటులలో వ్యక్తిత్వం బలిసి, సహకారం సమసిపోయింది. ఉదరారాధనావేశం వారిహృదయాలను ఆక్రమించింది—కళారాధనావేశం మటుకు పెదవులను దాటదు... ఇది నిజం — కాబట్టి నిష్ఠురం !!!

ఉదరం మొదట—కళ తర్వాత: ఒప్పుకుంటాం. ఆకలిముందు—అభినయం తర్వాత నిజమే కాని పొదుగుముందు—పాలుతర్వాత! మరి, పొదుగుకోసి పాలుతాగుతున్నారే మన కిరాయినటులు !! చిల్లరనటుల సంగతి అలావుంచండి- ఆంధ్రనాట్యకళ తనలో మూర్తీభవించినట్లు చెప్పుకుంటూ, బిరుదాలను ధరించిన ఒక్కొక్క—ఆటకు రెండువందలు రూపాయలు కిరాయి తీసుకుంటూవున్న మన ఒకటోతరగతి నటులగూర్చి ఏమనాలి ?

నాటకప్రదర్శనం సర్వాంగసుందరంగా ఉండాలంటే, దానిలో పాల్గొనే నటులలో సమిష్టిసహకారం ఉండాలి. సమిష్టిసహకారం ఉండాలంటే ఒక స్థిరమైన సమాజం ఉండాలి. ఇదిఅందరికీ తెలిసిన సత్యమే ! కాని ఆచరణలో పెట్టగలిగినవారు ఆంధ్రదేశం మొత్తంమీద ఇప్పుడు ముగ్గురే కనబడుతున్నారు— వారిలో ప్రథములు, బందరు వాస్తవ్యులైన శ్రీయుత డి.వి.సుబ్బారావుగారు; ఇప్పుడు శ్రీయుత పి.సూరిబాబు శ్రీమతి రాజేశ్వరి. డి.వి. సుబ్బారావుగారు చిత్తశుద్ధిగల కళారాధకుడు కాబట్టే, స్వయంగా ఒకసమాజాన్ని నిర్మించుకొని, దానిని పెక్కేండ్లనుంచి పట్టుదలతో నడుపుతూ కిరాయినటులచేత అనుక్షణం ఖూనీచేయబడుతున్న ఆంధ్రనాట్యరంగానికి ప్రాణదానం చేస్తున్నాడు. ఆయనచేస్తున్న ఈసేవ ఆంధ్రనాట్యకళాప్రియులు ఎన్నటికీ మరువరాని సేవ. వారితర్వాత ఇప్పుడు మాసూరిబాబు మారాజేశ్వరీ తమ రాజేశ్వరీ నాటకమండలి ద్వారా చేస్తున్న కృషి మిక్కిలి శ్లాఘనీయం.

సమాజం లేకుండా, సమిష్టి సహకారం లేకుండా, క్రమశిక్షణ లేకుండా, ఉచిత రంగాలంకార సామగ్రి లేకుండా, 'కాంబినేషన్' జట్లులా ఆడుతూవున్న ఆ అరాజకపు నాటకాలను ఇన్నాళ్లూ ఎలా సహించి ఊరుకున్నాం? జవాబు సులభం. ఇంట్లో దోమల్నీ వీధిలో మురికినీ ఎలా సహించి ఊరుకున్నామో అలాగే 'వీటినీ!

మన హిందూ మనస్తత్వంలో అహింసా సహనమూ వేళ్లు పాతుకుని ఉన్నాయి. ఈ రెండూ మనజాతికి అలంకార ప్రాయాలనీ, విశాల ప్రపంచములో ఈ రెంటికీ మనదే అగ్రస్థానమనీ, మనకు మనం సంతోషించటం కద్దు – ఖండాంతరవాసులుకూడా మనల్ని పొగడటం కద్దు. కాని మన అహింస దుర్బలత్వంలోకి, మన సహనం జడత్వంలోకి దిగజారినప్పుడు, జాగృతికి వేళ అయిందని తెలుసుకోవాలి.

శేషం వెంకటపతి రచించిన తారాశశాంకములోని పద్యాలలో కొన్నిటిని మూచాలు తిప్పకుండా, కొన్నిటిని అక్కడక్కడ సవరించి, ఈ నాటకరచనలో నేను ఉపయోగించుకున్నాను. ఆ పద్యాలకు “ .” ఈవిధమైన గుర్తులు ఉంచాను.

ఈ తారాశశాంక నాటకరచన నన్ను చాలా కష్టపెట్టింది. ఎందుకంటే శేషం వెంకటపతి రచించిన కథావిధానాన్ని బట్టి, ఈ కథయెడల ప్రజానీకంలో ఒక హేయభావం పాతుకుపోయింది. ఆ హేయభావాన్ని తొలగించి, కథయెడలా అందలి పాత్రలయెడలా ప్రేక్షకులకు సానుభూతి కలిగేటట్లు రచించడమంటే ఏటికి ఎదురీదడమే అయింది!! ఎంతవరకు నా కృషి ఫలించిందో ప్రేక్షకమహాజనులే నిర్ణయింతురుగాక!

బెజవాడ,
ఆగస్టు 1951

కొప్పరపు సుబ్బారావు

---

# తారాశశాంకము పాత్రలు

**పురుషులు**

బృహస్పతి
అత్రి
శుక్రుడు
నారదుడు
చిన్న చంద్రుడు
చంద్రుడు
లంబోదరుడు (లంబూ)
జంబుకేశ్వరుడు (జంబూ)
మాతలి
కొందరు శిష్యులు
వటువులు వగైరా

**స్త్రీలు**

తార
శాంత
అనసూయ

# అంకం ఒకటి

## దృశ్యం ఒకటి

## అత్రి ఆశ్రమం

అత్రి అనసూయ వటువులు ఇతరమహర్షులు పురోహితుడు ఉన్నారు. ఉపనయనం అయిపోయింది. ఋషులు ఆశీర్వాద మంత్రాలు చదువుతున్నారు. చదివినతర్వాత చంద్రునిమీద అక్షతలు జల్లుతారు. అటు పిమ్మట, అత్రి అనసూయ చంద్రుడు పీటలమీదనుంచి లేస్తారు.

ముందుకు వస్తారు.

అత్రి- నాయనా! చంద్రా! భగవత్స్వరూపులగు ఈ మహర్షులకెల్ల నమస్కరించి వారి అమోఘాశీర్వచనములచే బవిత్రుడవుగమ్మా!

అత్రి అనసూయలు చంద్రుడిచేత ఒక్కొక్క మహర్షికి నమస్కారం చేయిస్తారు. చంద్రుడు "వందే భగవన్!" అంటూ నమస్కారం చెయ్యగా "విద్యాసంపన్నో భవ!" అని ఒకరూ, "వినయసంపన్నో భవ!" అని ఒకరూ, "కీర్తిసంపన్నో భవ!" అని ఒకరూ దీవిస్తారు. అనంతరం—

అత్రి- అనసూయా!

శా. ఎన్నోనోములునోచి యీచిఱుతన య్యీశప్రసాదంబుచేఁ
గన్నా మెంతయుఁ బెంచినాము వడుగున్ గావించినామీపయిన్
గొన్నాళ్లీగురునొద్దకోయనిపి యీ కుఱ్ఱన్ సువిజ్ఞానసం
పన్నున్ జేయఁగ వేళవచ్చె, నిఁకఁ బంపన్ మేలుగాదే సఖీ?

అన- ఈతడు విద్యావంతుడౌటకు మనస్సు ఉత్సహించుచున్నను వియోగప్రాప్తికి ఆరాటపడుచున్నది. నాథా! ఇప్పట్టున నావిన్నపమొండు కలదు.

అత్రి- ఎట్టిదది?

అన- బ్రహ్మర్షిచంద్రులును వేదవేదాంగ విద్యాపారంగతులును అగు మీరే ఉపాధ్యాయులరై ఈకుఱ్ఱను సమస్తవిద్యా పరిపూర్ణునిగా జేయగలరు. అట్టియెడ మఱొక గురువునొద్ద కనుపనేల?

అత్రి- అనసూయా! తండ్రి యెంతటి విద్యావంతుడైనను తనయునకు గురువగుట శ్రేయస్కరముకాదని నాఅభిప్రాయము. ఏలయనగా—

గీ. తండ్రి మోహము కొడుకుశ్రద్ధను నడల్చు;
శ్రద్ధసడలిన శిష్యుడు జడతఁ గాంచు;

జడుని చదువెల్ల నీటిపైఁ జమురుచుక్క;
తండ్రి సుతునొజ్జయౌటలనర్థంబుగాదె ?—

అన- అటులైన ఈ చిఱుతికెవ్వనిని గురువుగా నిశ్చయించినారు ?

అత్రి- సకలవిద్యావాచస్పతియగు బృహస్పతినే వీనిగురువుగా నుద్దేశించితిని. కుమారా! చంద్రా!

చంద్ర- జనకా ! ఆజ్ఞయేమి ?

అత్రి- విద్యాభ్యాసముకొఱకై కొన్నాళ్లునీవు గురుకులావాసము చేయవలసియున్నది. నాయనా! విద్యకంటె శ్రేష్ఠమైన పురుషార్థము లేదుసుమా !

ఉ. "ఆరనిజ్యోతి; యక్షయమహానిధిఁ జూపు నవాంజనంబు, నీ
రూఢికివచ్చి తోడుపడనోపిన బంధువు. జ్ఞాతివర్గముల్
గోరని సొమ్ము, దేవ. నరలోక వశీకరణౌషధం. బసా
ధారణమైనవిద్య, సుకృతమ్మునఁగాక లభించునే సుతా !"

చంద్ర- పితృదేవుల హితోపదేశములను శిరసున ధరించుచున్నాను.

అన- నాయనా! దేవగురువైన బృహస్పతియే నీకు తగిన విద్యాగురువు. ఇకబాగుగ నా సద్గురుని యాశ్రమమ్మునకేగి ఆయనను సందర్శించి వినయ వినమిత శిరస్కుఁడవై విద్యాభిక్ష నర్థించెదవుగాక చంద్రా! —

ఉ. సేవలకెల్ల సేవ గురుసేవ; గురుండవ నొక్కఁడేసుమీ
దేవగురుండు గీష్పతి: తదీయముఖమ్మున విద్యనేర్చెదే
నీవుగడింపఁగాఁ దగిన నిక్కపు జీవధనమ్ము; సొమ్ము! వి
ద్యావిభవుండవై యశమునంది రయమ్మునరమ్ము పుత్రకా !

చంద్ర- (మోకరించి) జనకా ! ఆశీర్వదించుము.

అత్రి- గురుశుశ్రూషాఫలసిద్ధిరస్తు.

చంద్ర-(మోకరించి) జననీ! దీవించుము.

అన- సమస్తసన్మంగళానిభవంతు !

చంద్ర- (మోకరించి) మహాత్ములారా! అనుగ్రహింపుడు.

అందరు-యశస్వీభవ ! యశస్వీభవ !

అత్రి- నాయనా ! కొంతదూరమువరకు నేను తోడువచ్చెదను పదమ్ము.

చంద్రుణ్ణి పంపిస్తూ
అందరూ కోరస్ పాట పాడుతారు. (1)

---

## దృశ్యం — రెండు

### బృహస్పత్యాశ్రమానికి పోయే ఒకతోవ

శాంతా లంబూ జంబూ ప్రవేశం.

జంబూ నెత్తిమీద చితుకులమోపు వుంది.

లంబూ నెత్తిమీద కూరగాయలమూట వుంది.

శాంతచంకలో నీళ్లబిందె వుంది.

ఉతికి పిండిన తడిగుడ్డలు కొన్ని బుజంమీద ఉన్నాయ్.

శాంత- ఇలా పెళ్లినడకలు నడిస్తే ఇవ్వాళ అమ్మగారి చేత చీవాట్లు మామ్మాటికీ నిశ్చయం

జంబూ- ఈ వెధవమోపు చచ్చేటంత బరువుంది. తెలుసా ?

లంబూ- ఈ కూరగాయల హిమాలయం క్రింద అప్పచ్చిలాగ అణగారిపోతున్నాను.

శాంత- నాకుమాత్రం తక్కువబరువుందా ?

లంబూ- ఆడవాళ్ళ జన్మపొడుగునా ఏదోవిధంగా బరువుమొయ్యక తప్పదులే.

శాంత- అంటే ?

జంబూ- మొట్టమొదటనుంచి ఒళ్ళుబరువూ—

లంబూ- తర్వాత భర్తబరువూ—

శాంత- నోరుముయ్ !

జంబూ- అనంతరం పిల్లలబరువూ—

లంబూ- అబ్బబ్బబ్బబ్బ ! జంబూ ! నడుమువిరుచుకుని పోతూవుందిరా. కొంచెంసేపైనా విశ్రాంతి తీసుకోకపోతే ఇక అడుగుసాగడం కల్ల. (కూరగాయలమూట దింపుకుంటాడు)

జంబూ- నా అవస్థా అలాగేవుందిలే (చితుకులమోపు దింపుకుంటాడు)

శాంత- (ఆగకుండా వెళ్లిపోతూవుండగా)

లంబూ- శాంతా !

జంబూ- శాంతా !

లంబూ- ఒంటరిగా వెళ్ళవద్దు.

జంబూ- వానకురిసి దారిఅంతా జావళావైంది. జారిపోతే ప్రమాదం.

లంబూ- అదీగాక, నిన్నటినుంచీ మన ఆశ్రమం చుట్టూ ఒక పెద్దపులి తారాడుతూవుందని కోయవాళ్ళు చెబుతున్నారు.

శాంత- అమ్మయ్యో ! నిజంగానా ?

లంబూ- దాని గాండ్రింపు వినేదాకా అలాగే అనకమానవ్.

శాంత- (నీళ్లబిందె దింపుకుంటూ) రేపటినుంచీ నీళ్లకోసం నేను రానేరాను.

జంబూ- సమిధలకోసం నేనూ రాను.
లంబూ- కూరగాయలకోసం నేను అంతకంటే రాను.
శాంత- (కొంటెతనంగా) కాదు. నేను యథాప్రకారంగానే వస్తా
లంబూ- అలాగైతే నేనూవస్తా
జంబూ- నేనూవస్తా.
శాంత- (ఫక్కున నవ్వుతూ) గొర్రెలమంద.
లంబూ-ఒరేయ్ జంబూ !
జంబూ-ఏమిట్రా లంబూ ?
లంబూ-మనల్ని గొర్రెలమంద అని దారుణంగా అవమానించింది. దిగమింగికూర్చోడం పురుషలక్షణమంటావా ?
జంబూ-ఓసీశాంతా ! నువ్వు తారాదేవికి శిష్యురాలవైతే మేము బృహస్పతులవారికి శిష్యులం జాగ్రత.
లంబూ-అమ్మగారికంటే అయ్యబృహస్పతి అనేకరెట్లు అధికం. తెలుసా ?
శాంత- ఎందుచేత ?
జంబూ- మగవాడు కావడంచేత !
శాంత- మన బృహస్పతులవారిని నేను మగవాళ్లజాబితాలో చేర్చలేదు. తెలిసిందా ?
జంబూ-చెప్పవూ ?! — అయితే, అప్పుడే ఒకజాబితా. లెక్కా, డొక్కా— భేష్‌భేష్! ఇంతవరకూ వికసించిందా నీ బుద్ధి !
లంబూ-ఒరేయ్ ! పువ్వుపుట్టినతర్వాత వికసించకుండా ఉంటుందట్రా ? అయితే ఒక్కటే భేదం. అసలు పువ్వులు భ్రమరచుంబనం ఆనిన తర్వాతగాని వికసించవు. ఈ ఆడపువ్వులు వికసించిన తర్వాతగాని అనవు.
శాంత- (బుజంమీద తడిదోవతిని లంబూనెత్తిమీద పిండుతూ) నీ విద్యావైదుష్యానికి దేవతల అమృతవర్షం !
లంబూ-(తుడుచుకుంటూ) నన్ను ఎంత అవమానించినా సహిస్తాగాని నా విద్యను అవమానిస్తే సహించనుసుమా. అనేకసార్లు ఇలాగే హేళన చేశావు. ఇంకోసారి ఊరుకోను. హెచ్చరిక !
జంబూ-ఒరేయ్ ! ఒక్కసారి మన విద్యాపరాక్రమాన్ని ప్రదర్శిస్తేనేగాని దీనికి ఈ అహంకారం అణగదేమో ?
లంబూ-ప్రదర్శింతమా జంబూ !
జంబూ-అవశ్యము లంబూ !
లంబూ-(అమాంతంగా రౌద్రం తెచ్చుకొని) ఓసీ శాంతా ! ఇదే అస్మదీయ ప్రచండ విద్యాపాండిత్యమును చవిచూచెదవుగాక ! నిలు ! నిలు !

సీ. పొలతిరో ! నీతోడ వలపు రహస్యముల్
తర్కించుటే సుమీ తర్కవిద్య

జంబూ—అంగనా ! నీ వద్ద శృంగార శబ్ద ల
క్షణము నేర్పుటయె వ్యాకరణవిద్య

లంబూ—మగువ ! నా మనసు నీ మనసులో నైక్యంబు
నొందించు కేసుమీ యోగవిద్య

జంబూ—తరుణి ! నీ యందచందములు కుల్కులు వగల్
సంఖ్య యెనర్చుటే సాంఖ్యవిద్య"

లంబూ—మోహినీ ! కోపభరమున మూసికొన్న
ముద్దు పెదవులు తెరచుటే మోక్షవిద్య

జంబూ లంబూ (కలిసి) వనిత ! మన మొక్కటౌటె యద్వైతవిద్య

జంబూ లంబూ (కలిసి) తన్వి ! కాకున్న పాపిష్టి ద్వైతవిద్య.

పద్యం ముగిసేటప్పటికి శాంత నీళ్ళబిందె

చంకలో పెట్టుకుంటుంది.

శాంత- అమ్మగారితో చెప్పి మీయిద్దరి పొగరు తీయించకపోతే నా పేరు శాంత కాదు
(అంటూ త్వరగ బయలుదేరుతుంది)

జంబు చితుకల మోపునూ, లంబు కూరగాయలమూటనూ నెత్తిమీద
పెట్టుకుని శాంత వెంబడి ఈడిగువ తత్త్వం పాడుతూ నిష్క్రమణం.

జంబు —విద్యలన్నిటి తత్త్వమేమో విప్పిచెప్పర సద్గురూ !

లంబు —విద్యలన్నిటి తత్త్వం మొకటే ప్రేమతత్త్వము శిష్యుడా !

జంబు —ప్రేమతత్త్వములోని బ్రహ్మము తావు చెప్పర సద్గురూ !

లంబు —ప్రేమతత్త్వబ్రహ్మ తావు భామయధరము శిష్యుడా!

ముగుస్తూ నిష్క్రమణం.

## దృశ్యం - మూడు

బృహస్పతి ఆశ్రమం వెలుపల వటచ్ఛాయలో బృహస్పతి శిష్యవర్గంచేత
అధ్యయనం చేయిస్తున్నాడు —

శంనో మిత్రః శంవరుణః - శంనో భవత్వర్యమా -
శంన ఇంద్రో బృహస్పతిః - శంనో విష్ణు రురుక్రమః -
నమో బ్రాహ్మణే - నమస్తేవాయో - త్వమేవ ప్రత్యక్షం
బ్రహ్మాసి - త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి -
ఋతం వదిష్యామి - సత్యం వదిష్యామి - తన్మామవతు -
తద్వక్తారమవతు - అవతుమామ్ - అవతు వక్తారమ్.
ఓం శాంతిః శాంతిః శాంతిః

(అప్పుడు చంద్రుడు ప్రవేశం)

చంద్ర— (ప్రవేశిస్తు) విద్యాభిక్షామ్ దేహిమే ! విద్యాభిక్షామ్ దేహిమే ! (అని బృహస్పతిముందు సాష్టాంగపడును)

బృహ— చిరంజీవ ! చిరంజీవ ! లెమ్ము ? బాలకా ! ఎవరునీవు ?

చంద్ర— (లేచి) భగవన్ ! అఖండ తేజోరాశియగు నత్రిమహర్షికిని జగదేకారాధ్యురాలగు ననసూయాదేవికిని పుత్రుడను. నాపేరు చంద్రుడు.

బృహ— సంతోషము. సంతోషము. చంద్రా ! నీపితృదేవుల యాశ్రమములో నెల్లరును కుశలమా ?

చంద్ర— భగవన్ ! మీదయవలన నెల్లరకును క్షేమమే.

ఉ. "మాతలిదండ్రు లన్నలును మాహితులాప్తులు బంధుకోటి
ప్రీతిగనున్నవారచట, మీచరణాంబుజ సేవజేయ న
న్నీతరిబంపగా నెలమి నేనిచ్చటవచ్చితి ? నన్ను శిష్యుని
నీ తనుజాతురీతిని వినీతునిగా నొనరించి బ్రోవవే !"

బృహ— కుమారా ! నాశిష్యుడవగుటకు నింతగా నుత్సహించుచుంటివా ?

చంద్ర— భగవన్ ! మానవులకు దేవతలు గురువులు. దేవతలకు మీరు గురువులరైరి. అట్టి మీ గురుత్వముకన్న విద్యాభివృద్ధికి నాధారమేమియు నుండుకలదా ?

బృహ- కుమారా! నీవినయము మాకెంతేయు సంతసము కలిగించుచున్నది.

చంద్ర- భగవన్! నేటికి నేను కృతసంకల్పుడనైతిని.

ఉ. పావనమూర్తులాప్తులు కృపాపరతంత్రులు వేదవాదప్రం
భావసరస్వతుల్ దివిజవర్గ నమస్యులు స్వీకరించు నా
దేవగురుల్ మహాత్ములు త్వదీయపవిత్ర పదాంబుజాత సం
సేవఁ బునీతుడై వరలు శిష్యునకుఁ మరుజన్మమండునే.

బృహ- బాలకా! నీ వినయవివేకములు మాకెంతయు తృప్తి ఘటించినవి.

మ. "అనసూయావతి నీదుతల్లి, మునిరాజౌ అత్రి నీతండ్రి, త
జ్జననంబందిన నీకు నీవినయముఁ సౌజన్యమర్యాద వ
ర్తన మంచన్మధుకోక్తులున్ దలప వింతల్ గావు, రాజత్కళా
ఖనివై యొప్పెడినీవు శిష్యుడగుభాగ్యంబెన్న సామాన్యమే."

చంద్రా!

క. "పదు నెనిమిది విద్య లుసినుఁ
జదివించెద, వేయునేల? జగముల నెందున్
బదులితనికి లేదనిపిం
చెద, నిను నాయంతవానిఁ జేసెద చంద్రా!

చంద్ర- ధన్యోస్మి! ధన్యోస్మి! (సాష్టాంగపడును)

బృహ- ఆయుష్మాన్‌భవ! (చంద్రుణ్ణి లేవదీసి తెరవైపు మాచి) ఎవరక్కడ?

జంబూ } (ప్రవేశిస్తూ) చిత్తం గురుదేవా!
లంబూ }

బృహ- తార యేమిచేయుచున్నది?

లంబూ- ఇవ్వాళ మాంచివాడుమైన మువ్వంకాయలు తెచ్చాను గురుదేవా!

జంబూ- ఇవ్వాళ దొరికిన కట్టెలుకూడా బహువర్ధయోగ్యంగా వున్నయ్. గురుదేవా!

బృహ- మూఢులారా! తార యెక్కడ?

లంబూ- పూజామందిరంలో వున్నారు గురుదేవా!

బృహ- మంచిది. చంద్రా! పూజామందిరమునకేగి నీమాతృశ్రీని సందర్శించెదవు గాక.
రమ్ము!

(అందరూ నిష్క్రమణం)

---

## దృశ్యం - నాలుగు

బృహస్పతి ఆశ్రమాంతరంలో పూజామందిరం. తార ఈశ్వరీపూజ చేస్తున్నది.

### తారపాట (2)

(పాటచివర బృహస్పతి చంద్రునితో ప్రవేశం)

బృహ— తారా! ఈశ్వరీ పదచింతనాసక్త మానసవైన నీయేకాగ్రతను భంగమొనరించి నందుకు క్షమింతువుగాక. ఇదే-ఈబాలునిచూడుము!

తార– (చంద్రుని అలోకసామాన్యసౌందర్యాన్ని రెప్పవెయ్యకుండాచూస్తూ) ఎవరీతడు?

బృహ– మన అత్రి అనసూయల పుత్రకుడు. విద్యాభిక్ష నర్థించి మనవద్దకు వచ్చినాడు. చంద్రా! ఇకనుండి నీవు ఈమెయధీనము (తారను సంబోధించి)

ఉ. "నీరజగంధి! వీడు జననీ జనకుల్ కడుగారవమ్మునన్
వారక పెంపగా పెరిగినాఁడతికోమలదేహుఁ డీతనిన్
మేరమెఱింగి యాదరము మీరఁగ వేళకు వేళకున్ మనం
బారసి యన్నపానముల కాకొననీయకుమా తలోదరీ!"

నాకు దేవతార్చనకు వేళఅయినది. చంద్రా! సుముహూర్తమాలోచించి విద్యాభ్యాస మారంభించెదను. అంతవరకు ప్రయాణశ్రమము నపనయించుకొను చుందువుగాక. తారా! అనసూయాసాధ్వి నీభుజస్కంధమున మహాభారము నిక్షేపించినది సుమా! కుఱ్ఱవానిని కడుంగడు శ్రద్ధాదరములతో పెంచి ఆమె విశ్వాసమును నిల్పుకొందువుగాక. (నిష్క్రమణం)

చంద్ర– జననీ! గురుదేవులు నాచేతమీకు నమస్కారము చేయించుట విస్మరించినారు. ఇదే నా నమస్కారము.

తార– (రెండుచేతులు పట్టుకొని) ఆగు! గురువుగారికి చేసినప్పుడే గురుపత్నికిని చెందినది. (కొంచెం ఆగి)— నీపేరు చంద్రుడా?

చంద్ర– చిత్తము.

తార– చంద్రుడు..... చంద్రుడు...... శాంతా! శాంతా!

శాంత– (ప్రవేశిస్తు) పిల్చారా నన్ను?

తార– ఈకుఱ్ఱవానిని చూచావా!

శాంత- ఎవరు ?
తార- మన అనసూయలేదటే—
శాంత- ఔను. విన్నా—అత్రిమహర్షి భార్య...
తార- వారిపుత్రుడు.
శాంత- ఇక్కడికెందుకువచ్చాడు ?
తార- విద్యాభ్యాసనిమిత్తమట...
శాంత- మీ దగ్గరనా ?
తార- మనదగ్గరే.
శాంత- ఎంతఅందంగా ఉన్నాడమ్మా !
తార- దిష్టి పెట్టకే ! —పేరువిన్నావా ?
శాంత- అదికూడా అంత అందంగావుందా !
తార- చంద్రుడు !—చంద్రుడు !
శాంత- ఎంతబాగుంది !
తార- చంద్రుడా !...ఇకరా ! మారాయాసంతో కొంతా, మాసంభావణతో కొంతా నీకు విసుగు కలిగివుంటుంది.
చంద్ర- లేదు. జననీ ! లేదు. మీ యాదరణ నా శ్రమనంతయు పరిపించినది.
శాంత- అబ్బో ! చాలావ్యాకరణయుక్తంగా మాట్లాడుతున్నాడే!
తార- నీ తుపానుధాటికి ఈలేతపూరెమ్మ నిలువనేరదుసమా. జాగ్రత. చంద్రా ! చాలా జాగైంది. నీకు ఆకలై ఉండవచ్చు రాపోదాం.
శాంత_అమ్మా ! ఈకుఱ్ఱవాణ్ణి నేను స్నానం చేయించి తీసుకువస్తాకాని మీరువెళ్ళండి.

(లంబూ ప్రవేశం)

లంబూ_ అమ్మా ! ముద్దుంకాయ ఘుమఘుమ మూడుకోసులదాకా కొడుతూవుంది. పదును చెడకముందే భాండీని దింపాలి. రండి !
శాంత- అమ్మా ! చంద్రుడి వ్యవహారం నేనుచూస్తా. మీరువెళ్లరాదూ ?
తార_కాదు నీవే వెళ్లు.
లంబూ_ ఇదెక్కడికర్మ ! ముద్దుంకాయకూర మాడిపోతున్నదని మొత్తుకుంటూవుంటే ఇద్దరాడవాళ్లుండికూడా ఒక్కరూ కదలరేం ? (చంద్రుడికేసి కోరచూపులు చూస్తూ) ఈబుడత ఎవడో మాంచి రసకందాయంలో వచ్చిపడ్డాడే !
తార_ అసభ్యంగా మాట్లాడకు. శాంతా ! నీవుపోయి వంటపనిజూడు_లంబోదరా ! నీవుపోయి నీళ్ళుపోయి నీళ్ళుకాగబెట్టు ! ఎదురుచెప్పవద్దు ఇది నాయాజ్ఞ !

(మొహాలు చిట్లించుకొని ఇద్దరూ నిష్క్రమణం)

తార- చంద్రా! ఇకపోదాం రా!......కానిఒకబాధ నన్ను వేధిస్తుంది నీవు నిజంగా చంద్రుడివి. మరి—చంద్రునికి ఆహారం అమృతం. అది నేనెక్కడ తేగలను ?

చంద్ర- అమ్మా ! ప్రేమతో మీరొసంగు మంచినీరనైనను నాకు అమృతప్రాయమే.

తార- చంద్రా ! శక్తివంచనలేకుండా నావిధి నిర్వర్తించుకొంటా కాని, నా జీవితాకాశంలో నీలాటి బాలచంద్రుడొకడు ఉదయించగలడని కాని, ఈ విధంగా లేతవెన్నెల వెలుగు విరజిమ్మునని కాని కలలోనైనా అనుకోలేదు. రా !

తారపాట (3)

---

## దృశ్యం అయిదు

(పకపక నవ్వుతూ నారదుడు ప్రవేశము)

నార- తారా!... ఏమంటివి? "నాజీవితాకాశములో నీవంటి బాలచంద్రుడొకడు ఉదయింపగలడని, ఈవిధముగా లేతవెన్నెల వెలుగులు విరజిమ్మునని గాని, కలలోనైన అనుకొనలేదు" అనియా !.. ఔనౌను ! తారా !

చ. అనుకొనలేదు నీవు హరిణాంకుడొకండు గలండటంచు, వా
డనుకొనలేదు తారయనునామె యొకర్తుక యున్నదంచు మీ
రనుకొనకుండ సంఘటితమయ్యెను చక్కనిఘట్టు, మింక నే
మనుకొననేమి ? కాఁగలది యాటకే యీకథ వచ్చెఁదారరో !

నందనందనా ! ఆర్తజనశరణ్యా ! నీ సంకల్పములు దురూహ్యములు ! దురవగాహములు ॥

ఉ. ఆరుపదుల్ వయస్సున బృహస్పతి కక్కడ ? పాలుకాగి చ
ల్లారెను: తార కిర్వది వయస్సయినన్; నిజనాథ పాదసే
వారతి ప్రొద్దుపుచ్చుచుఁ ప్రపంచసుఖంబుల నెంచ, దట్టియా,
తారకు నేడు చంద్రుడు దాపరమాటకు హేతువేమొకో ?

ఔను. చూడజూడ ఈఘట్టముకడుంగడు విషయగర్భితమై కన్పట్టుచున్నది దీనినిజాగరూకతతో కనిపట్టి కలహభోజన ప్రాప్తికివలయు నుపాయమ్ములు వెతకుటయే ఇక నాకు కర్తవ్యము. హేకృష్ణా ! ద్వారకానిలయా !

నారదుని పాట

---

# అంకం రెండు

## దృశ్యం ఒకటి

బృహస్పతి ఆశ్రమం వెలుపల ఒక మార్గం

లంబూ జంబూలు ప్రవేశం

లంబూ- ఒరేయ్! నువ్వూ నేనూ ఈ ఆశ్రమంలోనికివచ్చి ఎన్నేళ్లు గడచిపోయాయో జ్ఞాపకంవుందా ?

జంబూ- చంద్రుడికంటే రెండుసంవత్సరాలేగా మనం ముందు వచ్చింది ?

లంబూ- చంద్రుడు ఈయాశ్రమంలో అడుగుపెట్టి ఎన్నేళ్ళయింది ?

జంబూ- పద్దానుగేళ్ళు.

లంబూ- కాబట్టి మనంవచ్చి పదహారేళ్ళయిందన్నమాట. మరి పద్దానుగేళ్ళనుంచీ అతడు చదివిన చదువుకీ, పదహారేళ్ళనుంచీ మనం చదివిన చదువుకీ, ఎంత తేడావుందో గమనించావా ?

జంబూ- గమనించకేం ?

సీ. తర్కభాష్యముల విద్వాన్ బిరుందతనికీ,
వంటలో మనకు విద్వాన్ బిరుందు

లంబూ— లక్ష్యలక్షణధనుర్లాఘవంబతనికి,
భక్ష్యభక్షణ కళాప్రౌఢిమనకు

జంబూ—గంధర్వ గానసంగతి వాసియతనికి,
వప్లదంపుడుపాట వాసిమనకు

లంబూ— సకలపురాణార్థచర్చలు వానికి,
'శాంతా' పురాణమే చర్చమనకు

జంబూ— చనవు గారాము ముద్దుముచ్చట లతనికి,

లంబూ— తిట్లు మొడనెప్లు మొట్లు చీవాట్లు మనకు,

జంబూ— మురిపెముగ బెంపబడ్డ పూమొక్క యతడు,

లంబూ— సంతవిడిచిన యాబోతు జంట మనము.

జంబూ- ఒరేయ్! మరోసంగతిగమనించావా ?

లంబూ- ఏమిటది ?

జంబూ- చంద్రుడు విద్యలోనేగాక విలాసాలలోకూడా పాండిత్యం సాధించడం సాగించాడు.

లంబూ- ఔనౌను గమనించా.

జంబూ- పద్ధానుగేళ్ళక్రితం ఆశ్రమంలో అడుగుపెట్టిన ఆపిరికిచూపుల పాలబుగ్గల చంద్రుడికి, నవయౌవన సౌందర్యాతిరేకంతో విగ్రహీభుచున్న ఈచంద్రుడికి ఎక్కడా పోలికే లేదుసుమా.

లంబూ- (రహస్యంగా) ఎలావుంటుందిరా ! — పూర్తిగా రెండావుల దూడయ్యాడు

జంబూ- (రహస్యంగా) తారవిడిస్తే శాంత — శాంతవిడిస్తే తార.

లంబూ- అందుచేతనే దూడ బాగాకండపట్టి తోకయెత్తి నృత్యంచేస్తున్నది. అదిగాక ఒరేయ్ ! అందచందాల్లో చంద్రుడివంటి సుందరుడు లేకపోవచ్చుగాని, ఆశ్రమములోవున్న ఆడవాళ్లందరికి ఇదేమి వేలంవెర్రో బోధపడకుండావుంది.

సీ. "కనురెప్పవెట్టి కాతనిజూచు నొక్కతే
చూచి యల్లన దలచూచిమెచ్చు —

జంబూ- మెచ్చులాడ వటంచు మెచ్చినవ్వు నొకర్తె
నవ్వుతోన గిరుక్కునను దోలంగు —

లంబూ- పయటచాటుగ నోరబరకించు నొక్కతె
బరికించి వానిదగ్గరకు బిలుచు —

జంబూ- బిలిచి యూరక ముచ్చటలనాడు నొక్కతె
ఆడి ఏకాంతమటంచు జేరు —

లంబూ- చేరి చెవిలోన గుసగుసల్ చెప్పినట్లు
మోము మోమున గదియించి మరియునొకర్తె"

జంబూ- ఇక్షుఖండంబుపై మూగు నీగలవలె
మురుసుకొని మ్రోతవెట్టి రీ ముగుదలార !

లంబూ- ఒరేయ్ ! కందమూల ఫలహారమని కాషాయవసన ధారణమనీ సాత్విక జీవనమని ఋష్యాశ్రమ వాసమనీ యెంతో గొప్పగా మనం చెప్పుకోవడమేగాని ఆడా మగా అనేవిషయం వచ్చేసరికి అది కిరాతపల్లెకూ మనకూ అంతగా భేదంకనపడదు సుమా.

జంబూ- సందేహమెందుకు ? అందుకు సజీవ దృష్టాంతముగా నీవూ నేనూ ఉన్నాంగదా !............ఒరేయ్ చూడుచూడు అదృశ్యం ! (తెరవైపుచూపిస్తాడు)

లంబూ- (చూస్తూ) బలే రమ్యంగా ఉంది. చంద్రుడు ఒకతే దీనివెంట పడ్డాడు. శాంత ఆలేడిని పట్టుకొని ఒకపొదలో దాచేసి పారిపోతున్నది.

జంబూ- ఈ శాంతసంగతి మరీగల్లంతుగా వుందిసుమా.

లంబూ- చంద్రుడు వచ్చినమొదలు ఇదిమనల్ని పూర్తిగా విడిచిపెట్టేసింది.

జంబూ- ఔను. దీనికళ్ళకు ఇప్పుడు మనమిద్దరము రాహుకేతువుల్లాగ కనపడుతున్నాం.

లంబూ- చంద్రుడివెంట తిరగవద్దని అమ్మగారు ఎన్ని సార్లు దీన్ని మందలించినా ఎలాగో అవకాశం చిక్కించుకొని కుమ్మరిసారెలాగా అస్తమానం ఇతడిచుట్టే తిరుగుతూ ఉంటుంది.

జంబూ- చంద్రుడికి కూడా దీనివెంట తిరగడం చాలా సరదా అనుకుంటా.

లంబూ- ఒరేయ్ ! పరుగెత్తుకుంటూ ఇద్దరూ యిటేవస్తున్నారు. ఏం చేద్దాం ?

జంబూ- (ఆలోచనతో రహస్యంగా) అమ్మగారితో చెప్పి ఆమెను ఇక్కడికి తీసుకు వచ్చి వీళ్ళయిద్దరితంతూ ఒక్కసారిచూపించి, ఘాటుగా శృంగభంగ చేయిద్దాం. రా !—

లంబూ. బాగుంది ఈఆలోచన. పదు !

(లంబూ జంబూలు నిష్క్రమణం)

---

## దృశ్యం - రెండు

బృహస్పతి ఆశ్రమంలో వనం

శాంతను తరుముతూ చంద్రుడు ప్రవేశం

### శాంతా చంద్రులకు డైలాగ్ పాట (4)

శాంత- ఎందుకు ఇలా నావెంటపడ్డావు !

చంద్ర- నాలేడిని నాకిమ్ము.

శాంత- నీలేడా ? నాకేం తెలుసు !

చంద్ర- నీవే దాని దాచితివి.

శాంత- నేనా ? ఏదీ ! (ఒళ్ళుదులుపుకుంటూ) ఎక్కడ !

చంద్ర- సరే: పోనీ (వెళ్ళిపోతాడు)

శాంత- చంద్రా ! (అడ్డంగా నిలబడి) వెళ్లనియ్యను.

చంద్ర- ఏల ?

(3)

శాంత- నాయిష్టం.

చంద్ర- శాంతా !_

శాంత- ఔను... ... చంద్రా! నాలారోజులనుంచి నిన్ను కొన్ని ప్రశ్నలడగాలని అనుకుంటున్నా. ఇవ్వాళ అడిగేస్తా_ సరియైన సమాధానం చెప్పివలెను.

చంద్ర- కానిమ్ము. ఎట్టివా ప్రశ్నలు ?

శాంత- తారాదేవి నీకేమవుతుంది ?

చంద్ర- తల్లి.

శాంత- తల్లియా !... ఎన్నాళ్ళయింది అసలు నిన్ను కని ?

చంద్ర- (కోపముతో) హాస్యమా ?

శాంత- నీతల్లి అనసూయసాధ్వి కాదూ ?

చంద్ర- ఆమెకన్నతల్లి _ ఈమె పెంపుడుతల్లి.

శాంత- ఓహోహో !

చంద్రి- ఔను శాంతా !

శాంత- బాగా యోచించే చెబుతున్నావా ?

చంద్రి- ఆవిధముగా ప్రశ్నించుటకు హేతువేమి ?

శాంత- ఉందికాబట్టే అడుగుతున్నా.

చంద్ర- శాంతా ! నీమెదడునందెట్టి అసహ్యపుటాలోచనలు కలవో నేనెరుగను. కాని నామనోగతము నాలించవవు గాక.

జనుడు మరల మరల జన్మమ్ములెత్తుట
తప్పదన్న మాట తథ్యమేని___
నూరుజన్మలెత్తి తారాసుతుండనై
పుట్టుసుగతి నాకు పట్టుగాత !___

శాంత- చంద్రా ! ఆతారాదేవి చేష్టలనూ హావభావాలను గమనిస్తున్నావా

చంద్ర- అంతగా గమనింప దగిన వేమియుండును

శాంత- చంద్రా ! నీవు వట్టి వెర్రివాడవైనా కావాలి లేకపోతే మంచి గడుసరివైనా కావాలి.

చంద్రి- ఎందుచేత ?

శాంత- నీకుతప్ప ఆశ్రమంలో అందరికీ ఆమెచేష్టలు చాలా విపరీతంగా కనిపిస్తున్నవి.

చంద్రి- నిజమా ? ఎట్టివవి ?

శాంత- ఎట్టివీఅంటే నేనేం చెప్పను ?... నేనూ ఆడదాన్నే!...అయినాచెప్తా.

చ. గడెతడ నీవు కన్నులకు గన్పడ కుంటివయేని తార తాఁ
దడఁబడ నేల? యున్నురని తారట లాడుచు నిన్నుఁ బిల్వఁగా
బుడుతులఁ బంప నేల? నినుఁ బోలిన శిష్యులుగారె యెల్లరున్?
చెడిన మనస్సువృత్తులివి, చెప్పగ నేలను విప్పి చంద్రుడా?—

చంద్రి- (కోపంతో) శాంతా! ఇదియెల్ల నీకపోల కల్పిత కథానకము.

శాంత- మదుసుదనవు బిభీకలు చాలించి, ఇంకావినా. ఆమె, ఒకనాడు—

సీ. "జిలుగుచీర వదల్చి చౌగావి ధరియించి
యేదిబాగనుచు నిన్నేల యడిగె?

చంద్రి- నన్నా?! ఆమెయా?! ఎన్నడు?!

శాంత- నేను చెప్పబోయేవన్నీ విని తర్వాత బూకరించు.

పైకనడల్చి యారజపుపైట ధరించి
యేది మేలనుచు నిన్నేలయడిగె?
జడవిచ్చి వింతగా జారుకొప్పు ధరించి
యేది నీటనుచు నిన్నేలయడిగె?
పైడిముక్కెరదీసి పచ్చతస్కుధరించి
యేది లెస్సయనుచు నిన్నేలయడిగె?"
ఇట్టి ప్రశ్నల కుత్తరం బీయలేక
అర్థమెరుఁగని బండవిద్యార్థిరీతి
గ్రుడ్లు నీవప్పగించిన గూఢదృశ్య
మొకటి, నాకంటబడెను లేవోయి చంద్ర!

చంద్రి— శాంతా! శాంతా! నిన్ను బ్రతిమాలుకొనెద! నన్ను రచ్చబెట్టకుము. నేనే పాపము నెరుంగను. శాంతా! నీవు నాకుమిక్కిలి నేస్తురాలవు. నాహృదయమును నీకడ దాపజాలను. త్రికరణశుద్ధిగా నాదుస్థితి నికవెల్లడించెద నాలింపుడు.

ఉ. అనుభవమహోన్నతన్ దొలుత నర్థమెరుంగగ నేరనైతినే,
దినములు మీదవడ్డ కొలదిన్ విశదంబగుచుండె తార భా

వన నెలకొన్న ఘోరపరివర్తన, హయ్యయో! శాంత! రేబవల్
కనులకు గూర్కురాదు, భయకంపితమయ్యెడు దేహమక్కటా!

శాంత- చంద్రా! బింకాలు విడచిపెట్టి నిజంచెప్పడానికి ప్రారంభించావు... నీహృదయానికి చాలా సంతోషపడుతున్నా.

చంద్ర- శాంతా! నాహృదయావేదన ఎంతనిచెప్పుదును?

సీ. ఆమెచర్యల యంతరార్థంబు తెలియని
యట్లు నటింతునా? ఆ దోశభయము!
తెలిసినరీతివర్తింతునా? యేమి సా
హసమొనరించునో? అదోశభయము!
తేటతెల్లంబుగా దెల్పి నీకిది తగ
దంచు వారింతునా? అదోశభయము!
వారింపకుందునా యేరీతి నెపుడేమి
యైపుట్టియున్నునో? అదోశభయము!
తల్లిదండ్రుల విడిచి విద్యార్థమిటకు
వచ్చితిని, చిన్నవాడ, నేపాపమెరుగ——
పిట్టపిడుగువిధాన నీఘట్టమొకటి
వచ్చిపడెనార! నాతలవ్రాతయేమొ?!

శాంత— చంద్రా! నీవల్ల తప్పులేదను విషయం ఇప్పుడు విస్పష్టమయింది.

చంద్ర- శాంతా! నేస్తురాలా! సహృదయా! కర్తవ్యము ననుగ్రహింపుము.

శాంత— సరే. చెప్పనా? వింటావా?

చంద్ర- అవశ్యము.

శాంత- చంద్రా! తారవల్ల నీకు బోధతప్పిపోవాలంటే ఒక్కటేమార్గం.

చంద్ర- ఎట్టిది?

శాంత— ఆమెకు నీమీద రోతపుట్టేట్టు చేసుకోవాలి.

చంద్ర- రోతయా? నామీదనా? ..సరే కాని, ఉపాయము?

శాంత- ఆడుదానికి మగవాడిమీద రోతకలగటానికి ఒక్కటే ఉపాయముంది.

చంద్ర- ఎట్టిదది?

శాంత- తనప్రేమను నిరాకరించి అన్యస్త్రీని ప్రేమిస్తే చాలు, ఆడుదానికి ఆ మగవానిమీద తప్పకుండా రోతపుడుతుంది.

చంద్ర- కాబట్టి నీ హితబోధ యేమని ?

శాంత- ఒకవంక తారను నిరాకరిస్తూ మరొకవంక అన్యస్త్రీని ప్రేమించు ఆదెబ్బతో తారకు నీమీద రోతపుట్టక తప్పదు. ఆరోతలోనే నీకు విముక్తి కలుగక తప్పదు.

చంద్ర- మంచిదే కాని, నే నేస్త్రీని ప్రేమింపగలను ? ఎవ్వరును గానరారే !

శాంత- (వెకిలిగానవ్వుతూ) ఇంతవరకూ ఇన్నేళ్ళనుంచీ ఈఆశ్రమంలో నీహృదయాన్ని ఆకర్షించగలిగిని స్త్రీ ఒక్కతెయూ లేదా ?

చంద్ర- అట్టి హృదయమొకటి నాకుండెనగదా అదిమయుమెరుంగుటకు ?

శాంత- కఠినుడా ! జీవంలేని పాషాణప్రతిమాశిల్పమా నీవిగ్రహం ?

చంద్ర- కోపపడకుము శాంతా !—

గీ. ప్రేమయనయెట్టిదో నాకిదేమి తెలియు ?
నా ప్రపంచము గురువు. గ్రంథములు, విద్య
తార, నీ, వింతియేగాక తదితరము
నాకుఁ గనుపింపలే దిన్నినాళ్ళు శాంత ?

శాంత- "ఇన్నినాళ్ళు" అంటున్నావు—చంద్రా ! ఇప్పుడిప్పుడు కనిపిస్తున్నదా నీకి ప్రపంచం ?

చంద్ర- కనిపించుచున్నది.

శాంత- ఏవిధముగా ?

చంద్ర- బహుభయంకరముగా ! —

శాంత- ఏమిటి ? భయంకరంగానా ! ప్రపంచమా ! (పకక్కున నవ్వుతుంది) ,

చంద్ర- శాంతా ! నీవుకూడా నన్ను నిరాకరించుటకు పూనుకొంటివా ? (కన్నీళ్ళతో) కానిమ్ము. ఈక్షణములో నాకును ఈయాశ్రమమునకును ఋణానుబంధము తెగింది. శాంతా ! నాతల్లిదండ్రులయొద్ద కిప్పుడే పలాయన మొనరించెదను. దానితో నాబాధలెల్ల తప్పక నివారణ కాగలవు. శాంతా ! సెలవు.

గీ. అమ్మ తారయటన్న నా కమితభయము
శాంత ! నీకడ నా కెచ్చు చనవు, ప్రీతి—
మరతు నామెను; నిన్ను నేనుమరువజాల
లతలవలె నల్లుకొన్న యుల్లముల నకట
త్రెంచుకొని పోవుచుంటి, క్షమించుశాంత !

(చంద్రుడు పోతూవుండగా శాంత అతణ్ణి గట్టిగాపట్టుకొని వణికిపోతూ)

శాంత- చంద్రా ! చంద్ర ! నీకు ఒకహృదయమున్నదా ? దానిలో ఒకమూలమాత్రం తావుకూడా నాకు వున్నదా ? చంద్రా ! రాయిటు. ముగింపు. మాట్లాడు! చంద్రా ! నన్ను నీవు నిజంగా నమ్మావా ? నమ్ముతావా ? నమ్మగలవా ?

చంద్ర- నిన్ను నమ్మకుందునా శాంతా !

శాంత- కాని, అమాయకుడా ! నేను నమ్మదగిన స్త్రీని కాదు సుమా!

చంద్ర- ఎందుచేత ?

శాంత- తారలో మొలకెత్తిన దోషమే నాలోకూడా తలయెత్తుతున్నదేమో? ఎవరు చెప్పగలరు

చంద్ర- శాంతా ! నీకట్టి తలంపు కలుగుచుండెనేని కల్గి. ఒకవేళ కలిగినను నేను సహించు కొందును.

శాంత- చంద్రా ! జారిపోతున్నావా ?

చంద్ర- కాదు. ఆమె నా తల్లి — నీవు నా సహాధ్యాయినివి. ఆమె గురుపత్ని — నీవు నేస్తురాలవు ఆమె కోరిక లోకవిరుద్ధము. నీతలపు లోకసహజము. అందుచేత సహనమున కవకాశమున్నదని నా యభిప్రాయము.

శాంత- అటులేని, చంద్రా ! నీవు నా సద్వర్తనమందు సంపూర్ణ విశ్వాసముంచి, ఈ క్షణమునుంచి నేనుచెప్పినట్లు నడుచుకుంటావా ?

చంద్ర- అట్లే నడచుకొందును.

శాంత- మంచిది. ఆతారకు నీమీద కోతపుట్టాలని నేనొక గమ్మత్తు చేస్తాను.

చంద్ర- ఎట్టిదది !

శాంత- ఈ క్షణంనుంచి నీకు నేనేప్రియురాలిగా నటిస్తాను. నీవు సహించగలవుకదా ?

చంద్ర- నా ప్రియురాలిగానా ! నీవా !

శాంతా- అంటే — నటించడంవరకేలే.

చంద్ర- మరి—నేనేమిచేయవలెను ?

శాంత- నీవూ నటించాలి.

చంద్ర- ఏవిధముగా ?

శాంత- నాప్రియుడిలాగా

చంద్ర- గొప్ప చిక్కు తెచ్చి పెట్టితివే !

శాంత- అదుగో ! అదుగో ! చంద్రా ! ఆ కొంటెగాళ్ళు —— లంబోదరజంబులు నీమీదా నామీదా ఏవో చాడీలుచెప్పి తారను యిటు తీసుకువస్తున్నారు. రా ఇదేసమయం. మన్మథతంత్రంలోవున్న మంత్రాలన్నీ ప్రయోగించి తారకు

నీమీద గోత్రప్రస్ట్టుచేస్తా. రా. భయపడకు. ఊఁ! చూడు. నామాటలు అర్థంచేసుకొంటూ నాతోపాటు ఆడు. నాతోపాటు పాడు!

ప్రేమతత్వంమీద శాంతా చంద్రులకు

తైలాగ్ పాట (5)

పాటపాడుతూ శృంగారచేష్టలను నటిస్తూ ఇద్దరూ నిష్క్రమణం.

---

## దృశ్యం - మూడు

అదే ఆశ్రమవనిలో

లంబూ జంబూలు తోవచూపగా తార పరుగుతో ప్రవేశం.

లంబూ- అదుగో! అదుగో! చూడండి. మీరేచూడండి.

జంబూ- చూడండి. అర్ధంభుంది — మొహంవుంది. అర్థం చెప్పవలసినంత అగత్యం మాకేంముంది. చూడండి. ఎంతనిర్భయంగా విహరిస్తున్నారో చూడండి.

లంబూ- ఇది పవిత్రమైన మున్యాశ్రమ మనుకున్నారో? పానశాల అనుకున్నారో!

జంబూ- అమ్మయ్యో! పట్టపగటివేళ — అందరూ తిరిగేవేళ —

లంబూ- కలియుగం ఇవ్వాలే వచ్చినట్లుందిరా!

జంబూ- అమ్మా! వీళ్లను దండించకపోతే ఏం జరుగుతుందో తెలుసా?

లంబూ- ఏం జరగడం ఏమిటి? ఆశ్రమానికి భూకంపం వస్తుందిరా భూకంపం!

తార- అయితే, వటువులారా! శాంతాచంద్రులు ఈరీతిగా ప్రవర్తించుట ఇదివరకెప్పుడైనా మీకంట పడినదా?

జంబూ- ఏమోనమ్మా! ఈగొడవలన్నీ మాకేం తెలుసు? మీ అదుపాజ్ఞలో వున్నాడు గదా అని అనుకున్నాము గాని చంద్రుణ్ణిఇలా గజ్జెలగుర్రంలాగ విడిచిపెడతారని మే మేలా అనుకుంటాము।

లంబూ- అదీగాక చంద్రుడి వయసెక్కడ। శాంత వయసెక్కడ। ఈవిపరీతానికి అవకాశం ఎక్కడ।

తార- అయితే, లంబోదరా। వయస్సుతోపాటు మనస్సుకూడా వికారం పొందుతూ వుంటుందనా నీ యభిప్రాయం।

లంబూ- అమ్మయ్యో। ఆలాంటి ప్రశ్న వేశారేమిటి। వయస్సు ముదిరినకొద్దీ మనస్సు కూడా గిడసబారి పోవాలమ్మా - దేహధర్మమంటు అది.

జంబూ- అమ్మా। ఉదాహరణకు చెప్తాను. మీరున్నారనుకోండి. మీకు వయస్సు మనస్సూ సమగతిలో ఉన్నయ్ - కాబట్టి మీఎండి జంట కోడెమాడల

బండిలాగ జమాయించి నడుస్తుంది. గురువులవారో, బృహస్పతి భగవాన్లవారు ఉన్నారనుకోండి. వారివయస్సు ముసలెద్దూ—వారిమనస్సు కోడెదూడా— అందుచేత, వారిబండి కుంటుతూ, పడుతూ, నడుస్తుంది—

తార- ఇక నోరుముయ్ ! - లంబోదరా ! నీవు సత్వరమేపోయి శాంతతో నేను రమ్మంటినని చెప్పి తీసుకొనిరా.

లంబూ- అమ్మా ! శాంత తప్పేఅంటారా ఇదంతా ?

జంబూ- చంద్రుడుకూడా శిక్షార్హుడే నమ్మా

తార- నోరుమూయండి. జంబూ ! వెళ్లు.

లంబూ- చిత్తం. (లంబూ నిష్క్రమణం)

తార- జంబుకేశ్వరా !

జంబూ- అమ్మా ?

తార- మీగురువులవారికి వయస్సెంత ?

జంబూ- మీకే తెలియాలి.

తార- ఊహించిచెప్పు.

జంబూ- బహుశా ఆరుపుష్కరాలు దాటివుంటయ్ అనుకుంటా.

తార- నావయిస్సెంత ?

జంబూ- నాకేంతెలుసు ?

తార- ఇదికూడా ఊహించిచెప్పు.

జంబూ- మీవయస్సు రెండోపుష్కరం మూడోపుష్కరం సందునఉండవచ్చునేమో కాని, ఎందుకమ్మా ఈవయస్సులభోగట్టా ?

తార- జంబూ ! వయోభేదంవల్ల శాంతాచంద్రుల వర్తన విపరీతంగా కనిపిస్తే, మరి ఆకారణంచేతనే తారాబృహస్పతుల దాంపత్యంకూడా లోకానికి విపరీతంగా కనుపించ దంటావా !

జంబూ- ఏమోనమ్మా !

తార- భయపడి చెప్పలేకపోతున్నావు. కాని, జంబుకేశ్వరా !

ఉ. ఆలుమగండటన్న విధియందలి చిత్రముగాక, వృద్ధుని
ల్లాలయినంత మాత్రమున యౌవ్వనశించునె? స్త్రీత్వమారునే?
పూలుగలట్టి తీవెయది పుట్టపయిన్ బడి ప్రాకుగాక, ఆ
పూలపరిమళంబులు గుబాళ్లని పర్వవె తెమ్మెరలెల్లదిక్కులన్ !

జంబూ- (ఏడుస్తు ప్రవేశించాడు)

జంబూ- అమ్మా ! మనవాడికి శాంతచేతుల్లో మంగళహారతి జరిగినట్లే తోస్తుంది.

తార- ఏమి జరిగినది ? ఇటుకు రానన్నదా !

లంబూ- (ఏడుపుతోనే మళ్ళీ 'ఔా' నన్నట్లు తలఊపుతాడు).

తార- రమ్మని నీవు బలత్కారం చేశావా

లంబూ- (ఏడుపుతోనే మళ్ళీ 'ఔా' నని సౌజ్ఞ)

తార- అందుకని నిన్ను కొట్టిందా

లంబూ- (ఏడుపుతోనే మళ్ళీ 'ఔా' నని సౌజ్ఞ)

తార- ఆడది కొట్టితే యేడ్చేమగవాళ్లు ఆడదిస్వతంత్రిస్తే నెత్తినోరూ బాదుకొనే నరలోకం, అంతా ఈఆశ్రమంలోనేవుంది — ఇది మా స్త్రీజాతి దురదృష్టం. వదవండి, శాంతాచంద్రుల వ్యవహారం నేనే పరిష్కారంచెయ్యాలి. ముందు మీరు పొండి. నెమ్మదిగా నేనువస్తా—

లంబూ } చిత్రం. చిత్రం.
జంబూ }

(లంబూ జంబూలు నిష్క్రమణం)

తార- (పెద్దనిట్టూర్పు విడిచి) అక్కటా ! —

ఉ. ఊరక బింకముల్ పలుకు చుంటిని - అంతెయెగాని చంద్రుడా
తీరున శాంతతో బ్రియువిధిన్ విహరించెడి దృశ్యమద్దిరా !
ఘోరదురంతమైహృదయఘూర్ణనమున్ బొనరించి, దేహమున్
దారుణ కేలకీలికల దగ్ధమొనర్పఁగ సాగెనక్కటా !—

(తార నిష్క్రమణం)

---

## దృశ్యం - నాలుగు

బృహస్పతి ఆశ్రమంలో వనాంతరం

శాంతా చంద్రుల ప్రేమవిహారం

డైలాగు పాట (6)

పాట చివర మొదలుకొని తార "చంద్రా ! ఆగు ! శాంతా ! చాలించు" అని చెప్పేమాటల వరకు షుమారు రెండునిమిషాల కాలం పట్టి ఆర్కెస్ట్రా మ్యూజిక్ జరుగుతూ వుండాలి. ఆమ్యూజిక్ మీద శాంతా చంద్రులు ప్రేమనృత్యం చేస్తుంటారు.

(4)

డైలాగుపాట పూర్తికాబోయే ముందే
లంబూ జంబూలు ప్రవేశం

లంబూ- ఏయ్ చంద్రా! నిన్నే

జంబూ- ఏయ్ శాంతా! ఇదిగో! యిటు చూడు. నిన్నే!

లంబూ- అమ్మగారు వస్తున్నార్రా!

జంబూ- మీ మంచికోసమే చెబుతున్నాం వినండీ!

లంబూ- మీ యిద్దరూ యిలా చిలకా గోరువంకల్లాగ ఆడుతూ వుంటే మాకు కూడా ఒళ్లు జలదరిస్తుంది సుమా.

జంబూ- శాంతా! చూడు. నన్ను కూడా కాసేపు అలాగే ఆడించవూ?

లంబూ- నన్నో?

జంబూ- చంద్రా! దయచేసి నువ్వు కొంచెం సేపు విశ్రాంతి తీసుకో. నేనూ శాంతా ఆడుకుంటాము.

లంబూ- ఒరేయ్! మొట్టమొదట ఒళ్ళు జలదరించడం నీకా? నాకా?... నాకే అని ఇందాకే చెప్పేశా, కాబట్టి నేనే మొదట ఆడాలి.

జంబూ- ఒరేయ్! అసలు సంగతి గమనించావా? మనం వీళ్ళకి కనపడడము లేదు. వినబడడమూ లేదు.

లంబూ- అయితే ఏం చేద్దాం?

జంబూ- నువ్వే చెప్పు.

లంబూ- మంచిది. ఒరేయ్! ఇక ఒకటే కర్తవ్యం. అసలు శాంత మనకు లభించనప్పుడు. నకిలు శాంతను సృష్టించుకొని ఆనందపడదాం. రా!

జంబూ- నకిలు శాంతి ఏమిట్రా నీ శ్రాద్ధం?—

లంబూ- అదేట్రా, నువ్వే శాంతవని, నేనే శాంతనని నువ్వూ అనుకొని ఇద్దరం ప్రేమించుకుందాం రా!

జంబూ- ఒరేయ్! ఇది చివరికి కటికీ పేజావాణీ అవుతుందేమో?—అయినా నమోనా చూద్దాం ఎలా వుంటుందో!

ఇద్దరూ చేతులు పట్టుకొని ఒకరు చంద్రుడు లాగా ఒకరు శాంతలాగా సరిగ్గా వాళ్లకు మల్లే (అందవికారంగా) ప్రేమనృత్యం చేస్తుంటారు.
ఈ దృశ్యం జరుగుతూ వున్న సమయంలో

తార ప్రవేశం

తార- శాంతా! చంద్రా!...... మీరు కూడానా! ఇదేమి విపరీతం? లంబూ! జంబూ! లంబూ! మిమ్మల్నే!... (ఏవ్వరికి వినపడడం లేదు) జంబూ! లంబూ! (గట్టిగా ఇద్దర్నీ చెరొక చరుపూ చరుస్తుంది)

జంబూ
లంబూ } అమ్మయ్యో ! అమ్మగారు !

అంటూ పరుగెత్తుకుపోతారు.

తార- చంద్రా ! ఆగు. శాంతా ! చాలించు.

శాంత- మీరా ?... ఎప్పుడువచ్చారు ?......క్షమించండి! ..చూడలేదు.

తార- చంద్రా ! అలిసిపోయావు కాబోలు. ఆశ్రమంలోనికిపోయి విశ్రాంతితీసుకో

చంద్ర- (తలవంచుకొని వెళ్ళుతుండగా)

శాంత- చంద్రా ! వెళ్ళవద్దు. (చేయిపట్టుకొని ఆపుతుంది)

తార- చంద్రా ! శాంత ఆపితే ఆగిపోయేస్థితికి వచ్చావా ?

చంద్ర- (మౌనం)

తార- ఈస్థితి నీకు ప్రాప్తించి యెన్నాళ్ళయింది ?

శాంత- చెప్పు... నీవూ నేనూ ఇలా సంచరించడం ఎన్నాళ్ళనుంచిఅని నీతల్లిగారు ప్రశ్నిస్తున్నారు. భయమెందుకు ? నిజంచెప్పు.

చంద్ర- (మౌనం)

శాంత- అమ్మా ! చంద్రుడి విషయం మీకు తెలియనిదేముంది ? వీడు మితభాషి అదీగాక మిమ్మల్నిచూస్తే అమితభయం. అందుచేత మౌనం ధరించాడు.

తార- ఓహో !

శాంత- కాబట్టి చంద్రుడి బదులూ నాబదులూ నేనే జవాబు చెప్తా...అయితే... మీ ప్రశ్నయేమని ?.........మరచిపోయా!.........ఆc....... ఈవ్యవహారం మా యిద్దరిసందునా ఎన్నాళ్ళనుంచి నడుస్తున్నది అని ప్రశ్నించారు. జవాబేమిటంటే ఇది చాలారోజులనుంచి నడుస్తున్నది.

చంద్ర- వట్టిది. వట్టిది. ఇందాకటినుంచీయే.

శాంత- కంగారులో ఒకటి చెప్పబోయి మరొకటి చెప్పరు. అమ్మా ! అసలు విషయ మేమిటంటే ఈకుర్రవాడు ఆరితేరిన వ్యభిచారిగా తయారయ్యాడు.

తార- ఆc ! శాంతా!.........

శాంత- ఔనమ్మా ! చూపులకు ఇలాటి పెద్దమనిషి చేష్టలకు ఇలాటి ధూర్తుడూ పుట్టలేదు — పుట్టబోడు !

చంద్ర- అమ్మయ్యో ! శాంతా ! అమ్మగారికి నాపైన నిక్కముగా రోతపుట్టునట్లే చెబుతున్నావు కదా !

శాంత- అబ్బే! అసహ్యానికి యెందుకుపుట్టాలి. నీమీదరోత! మగాడవు పడుచు వాడవు. నీజీవితానికి నీవేకర్తవు. నీయీడులో వుండేవాళ్లంతా ఏమి చేస్తారో నీవూ అదేచేస్తున్నావు. వాళ్ళందరిమీదా లేనిరోత నీమీద యెందుకుపుట్టాలి? అదీగాక —

తార- చాలించు నీఉపన్యాసం... చంద్రా! వెంటనే ఆశ్రమంలోనికి వెళ్లు!... ఇది నాయాజ్ఞ!... వెళ్ళు!... ఊఁ...

చంద్ర- (తలవంచుకొని నిష్క్రమించును)

శాంత- అమ్మా! ఇలాంటి నిరంకుశత్వం మీకు తగదు.

తార- శాంతా! ఇంతసేపు చంద్రున్నాడు కాబట్టి నేనేమీ అనలేదు. ఇకవిను. ఈ ఆశ్రమంలో ఇలాటి దురాగతం చేస్తున్నందుకు నీకు శిక్షవిధిస్తున్నాను. ఈ ఆశ్రమంనుంచి వెంటనే వెళ్ళిపో.

శాంత- సరే. చంద్రుణికూడా తీసుకొని ఇప్పుడే వెళ్ళిపోతా.

తార- చంద్రుడు నీవెంట యెందుకు వస్తాడు?

శాంత- నాకోసం వస్తాడు.

తార- సిగ్గుమాలినదానా! ఇంత గడసకత్తెవుగా ఎప్పుడు తయారయ్యావు?

శాంత- అమ్మా! నాకుకూడా ఒకభర్తవుంటే నేను భయపడాలి. నేను అవివాహితను. అతడు బ్రహ్మచారి. కాబట్టి నేను చేసేది వ్యభిచారం అనడానికి ఎవరికీ గుండెలున్నయి!

తార- చాలించు నీఉపన్యాసం. ఈక్షణంనుంచి ఈఆశ్రమంలో నీముఖంచూపించవద్దని ఆజ్ఞాపించా. పోయికి! . చంద్రుని ప్రసక్తి నీకనవసరం. వాడు నీవెంటరాడు. రావలచినను నేను రానీయను. తెలిసిందా! పో! ఈక్షణంపో!

శాంత- చంద్రుడిపై ఇంతఅభిమానం మీకెందుకు?

తార- ఆప్రశ్న నీకెందుకు?

శాంత- మరి, అదేగా మనకిద్దరికీ ఇప్పుడు కావలసింది?

తార- వాడు మాశిష్యుడు. తలిదండ్రులు వానిని మాకప్పగించారు. మళ్లీ యథావిధిగా వారికప్పగించేవరకూ అన్నిబాధ్యతలు మావి. తెలిసిందా?

శాంత- మీబాధ్యతలను ఇంతటి పట్టుదలతో నిర్వహిస్తున్నందుకు నిజంగా మిమ్మల్ని అభినందించాలి కాని, అమ్మా! చంద్రుడికి ఈడువచ్చింది. అంటే మీకు కోపం వస్తుందేమో. కాని —

చ. మగడతివృద్ధు, నీవు సుకుమారపు లేతవయస్సుదాన, వీ
జగతికి మంచిచెడ్డల విచారము తక్కువ, చంద్రుబోలు రూ
పగరిమ గలట్టి యౌవనుడు సంతతమింట వసించియున్న, నీ
తగవులమారి లోకము వృథాయపనిందలు మోపకుండునే?

తార- శాంతా! లోకం మోపినామోపకపోయినా ముందు నీవే మోపేటట్లున్నావు.

శాంత- క్షమించండి. మీరు అన్నివిద్యలూ చదివారు. నేను ఏవిద్యా చదువలేదు. కాని, భర్తసంసారం అనే ఆవరణలో మీరున్నారు. ఏఆవరణాలేని మైదానంమీద నేనున్నాను. స్వేచ్ఛ అంటే యేమిటో దాన్లోవున్న మాధుర్యంయెట్టిదో నాకు తెలుసు—మీకు తెలియదు. అందుచేత మీమీద – మీరున్న దుర్భర పరిస్థితుల మీద – మిమ్మల్ని చంచలంగా కుదిపివేస్తున్న భయంకర సమస్యలమీద, నాకు హృదయపూర్వకమైన సానుభూతి, నిర్వేదం, జాలీ కలిగి ఇవ్వాళ ఈప్రసంగం యెత్తాను.

తార- శాంతా! శాంతా! నామీద నీకు నిజంగా జాలికలిగిందా?

శాంత- అమ్మా! నేనూ ఆడదాన్నే! నాకూ ఉంది హృదయం.

తార- క్షమించు. శాంతా!. నేస్తగాలా!.. ఇలారా! (చేతులు చాచింది. కన్నీళ్ళు ఉబుకుతున్నయ్)

శాంత- అమ్మా!

తార- సఖీ!

(ఇద్దరూ ఒకరినొకరు గాఢంగా కౌగలించుకొంటారు)

తార- శాంతా! ఇక నీవద్దదాచను!.. దాచలేను!...

శాంత- ఏమిటమ్మా అది?

తార- చెప్తే నామీద నీకు రోతపుడుతుందేమో?

శాంత- అమ్మా! నాయందు విశ్వాసం కలగలేదా?

తార- శాంతా! నీకంటె నాకు ఆప్తులు లేరు. చెప్తావిను!—

ఉ. చప్పుడు సేయకుండఁ గడుచల్లగఁ బ్రాకుచువచ్చి, నిద్రమై
దప్పిన వాని చేలమునఁ దాఁ దలదూరిచి, కాటువేయు నా
సర్పమురీతి, నామనసు నందున నొక్క దురంతభావ మె
ట్లెప్పుడు కాలువెట్టునో? సఖి విషమున్ బ్రసరించె నక్కటా!

శాంత- అమ్మా! ఆడుదాని జీవితమే అధ్వాన్నపు జీవితం. అందులో ఇలాటికష్టాలు తటస్థించినపుడు ఆబాధ మరీ దుస్సహమవుతుంది. అమ్మా! ఏంజరిగింది? అసలు సంగతియేమిటి?

తార- శాంతా! ఏమనిచెప్పుదును?

మ. క్రమముఁ దప్పితినంచుఁ జింతపడనా? కామమ్ము నాత్రోవ యు
క్రమమో సక్రమమో? యధర్మమొ సధర్మంబో? సుధాస్వర్గమో!
క్రిమిదుర్గంధ నిబంధ నారకమొ? నాకేలా? తెగింతున్! ప్రియా
ర్థము లోకమ్మును ధిక్కరింతు! నసిధైర్యంబూనా! అక్కటా!

శాంత- అమ్మా! "ప్రియార్థము లోకమ్మును ధిక్కరింతు" అని అన్నారు ఎవరమ్మా ఆ ప్రియుడు?

తార- (ఉలికిపడి) ప్రియుడా! (వికిలినవ్వు నవ్వుతూ) నాకా? ప్రియుడా! పాపము శాంతించుగాక! (నాకులదేవతలు నన్నురక్షింతురుగాక! నిశ్చల భావాన్ని అరువుతెచ్చుకుంటూ) శాంతా! నాకు ప్రియుడు లేడు. భర్తవున్నాడు. ఆయనపేరు బృహస్పతి.

శాంత- అమ్మా! మీ వాక్కు మీమనసును ఈవిధంగా మందలించుకుంటూవుండేగాని ఈమాటలు లోకాన్ని ఉద్దేశించి చెప్పినవి కావు. సరే పోనివ్వండి. ప్రియశబ్దము భయంకరంగావినిపిస్తున్నది. కాబట్టి త్రోసిరాదు ఇక ఆప్రియుడు ఎవరోచెప్పండి

తార- ఏ ఆప్రియుడు?

శాంత- "ప్రియార్థము" అని సూచింపబడిన ఆతడే!

తార- ఆతడా! చెప్పనా? ఇలారా! చెవిలోచెప్తా (శాంతదగ్గరకువస్తుంది) ఆవ్యక్తి పేరు- శాంతా! మంజూమంజులము! కర్ణారుచిరము! సుధామధురము!...ఆతనిపేరు...

(ఇక్కడ బృహస్పతి అకస్మాత్తుగావచ్చి నిలబడ్డాడు. అతణ్ణి తార చూచి ప్రసంగం గభాలున మార్చివేసింది)

...బృహస్పతి భగవానులే. జగదేక బ్రహ్మజ్ఞాన సంపన్నులే! తారానయన చకోర చంద్రులే!...

బృహ- ఆనందము! మహదానందము!... తారా నీ నిరంతర భర్తృసంస్మరణాసక్తి నిజముగా త్రిజగద్వంద్యము.

తార- నాథా! వందనములు. ఎప్పుడువచ్చారు?

శాంత- భగవన్! ప్రణామములు.

బృహ- తారా! చంద్రుడేలనో నేడు అధ్యయనమునకు రాలేదు. వాడెందున్నాడో చూచిరమ్మని శిష్యుల బంపితిని. పెద్దతడవు రోదించిన వానివలె ముఖము

పొంగియున్నదనియు,ఏకతమ్మునతో దనలో దాను మిగులవేగజెందుచున్నాడనియు వాడు చెప్పినాడు.

మ. వినుసంబేనియు నూరకుండడు, మహానిష్ఠన్ సమస్తాగమా
గ్రములున్ శాస్త్రరహస్యముల్ గణితతర్కన్యాయ సిద్ధాంతముల్
క్రమతో నభ్యసనంబు సేయు; నితరోల్లాసంబులే లేవు చం
ద్రముడౌరా! యిటలేలడిల్పడియె ? తారా! నీవు చెప్పంగదే!

శాంత. భగవన్ । నేం చెప్పనా ? నిన్న వాడూ నేనూ పందెం వేసుకొని చెరో పడవాశేసి అప్పడాలు తిన్నాం. నాది మొద్దుశరీరం కాబట్టి కడుపులో కుట్టుచెయ్య లేదు. వాడిది సుకుమారశరీరం కాబట్టి అప్పడాలపిండి పేగులకుపట్టుకుని అజీర్ణపునొప్పితో ప్రొద్దుటనుంచి బాధపడుతున్నాడు.

బృహ- అదియా విషయము ?

శాంత- చిత్తం భగవన్. వాడికి ఆముదంయిద్దామా నేపాళంమాత్రవేద్దామాఅని ఇద్దరము ఆలోచించుకుంటూవున్నాము. మాఆలోచన తెగక, మీసలహా ప్రకారం చెయ్యాలని నిశ్చయించుకొని మీదగ్గరికే బయలుదేర బోతున్నాము. యింతలో మీరూ వచ్చేశారు, అయితే భగవన్। ఆముదం శ్రేష్ఠమా లేక నేపాళం ప్రశస్తమా ?

బృహ- రెండును ప్రశస్తములే.

శాంత- మరి కర్తవ్యమేమిటి భగవన్ ?

బృహ- లంఘనము। లంఘనము "లంఘనము పరమౌషధమ్" అని ఆయుర్వేద ప్రమాణము

శాంత- దివ్యవాక్యం। దివ్యవాక్యం। అమ్మా। విన్నారా। వాడెంత యేడ్చినాసరే ఇవ్వాళ ఏమీ తిననియ్యవద్దు సుమా।

(లంబు జంబూలు పరుగుతో ప్రవేశం)

లంబూ- వందే గురుదేవా।

జంబూ- నమస్తే భగవన్।

బృహ- ఏందుకురా యింత ఆత్రము ?

లంబూ- వస్తున్నది గురుదేవా। మన ఆశ్రమం వైపుకే వస్తున్నది.

బృహ- ఏమది ?

జంబు - విమానం గురుదేవా। విమానం।

బృహ- / తార- / శాంత- } విమానమా ?!

లంబూ } ఇదుగో ! అదుగో ! చూడండి.
జంబూ }

(అంతా ఆకాశం వంక చూస్తారు)

బృహ- ఔను అది యింద్రలోక విమానము. తారా ! శిష్యుడగు మహేంద్రుడు గాని అతని సందేశహరులు కాని వచ్చుచున్నారేమో ? అతిథిపూజకై మనముందు సిద్ధపడి యుండుట మేలు కదా ! తారా ! రమ్ము (తారతో నిష్క్రమణ) శాంతా ! శిష్యులారా ! మీరుకూడా సత్వరమే రండు.

(తారతో బృహస్పతి నిష్క్రమణం)

లంబూ- శాంతా !

జంబూ- బృహస్పత్యాశ్రమకాంతా !

లంబూ- ఆడుకోవే మాతో రవ్వంత ?

జంబూ- ఎందుకే కోపం నీకింత ?

శాంత- ఈకోడెదూడలకు వయస్సు గడిచిపోయి, ఏం చెయ్యాలో తెలియక వెర్రి గంతులు వేస్తున్నాయి.. అయితే బ్రహ్మచారి మర్కట శిరోమణులారా ! మీకు నాతో ఆడుకోవాలని వుందా ?

లంబూ } ఔను. ఔను.
జంబూ }

శాంత—నాలో ఏముంది ?

లంబూ } సుఖం ! సుఖం !
జంబూ }

శాంత_ ఓహో ! సరే. మీసుఖానికి మీకూ మధ్య నేనెందుకు అడ్డంరావాలి? సరే కాని నాకూ ఒక సుఖం కావాలి—యిస్తారా ?

లంబూ- యిస్తా.

జంబూ- వాడిమొహం— వెర్రి వేపకాయ. వాడికేంతెలుసు ? శాంతా ! నేనేయిస్తా.

లంబూ- కాదు, నేనేయిస్తా.

శాంత- మీయిద్దరూ కలిసే యివ్వాలి.

లంబూ- సై

జంబూ- సై

శాంత- సరే. సాముద్దుల యెద్దులారా ! అదిగో ఒకబండి. దానికి ఎద్దులు లేవు. ఎక్కాలని నాకు చాలా కుతూహలంగా వుంది. మీరేఎద్దులై దాన్నిలాగండి.. నేనే గమ్మత్తుగా కూర్చొని తోలుతా !...

లంబూ } (ఒకరి మొహం ఒకరు చూచుకొని, చివరకు)
జంబూ } సరే ! అలాగే ! పోదాం !

శాంత- ఆనందం ! సరే...ఇక్కడే ఉండండి. ఇప్పుడే మళ్ళీ వస్తా.

(శాంత నిష్క్రమణం)

లంబూ—
జంబూ— } (హిహిహి అంటూ పిచ్చిఆనందంతో నవ్వుతుంటారు)

లంబూ—ఒరేయ్! నరవాహనంఎక్కాలని ఇంత కుతూహలం ఎందుకు పుట్టిందో దీనికి

జంబూ—ఒరేయ్ ! మనలోవున్న గొప్పతనం మనకే తెలియుట లేదుగాని, మనల్ని చూస్తేచాలు ప్రతిస్త్రీకి ఇలాంటి సుకుమార భావాలే స్ఫురించి తీరాలి !

లంబూ— మరి, మనల్ని ఎద్దులారా కోడెలారా మధ్యేమధ్యే మర్కటములారా అని కూడా సంబోధించిందే దానికి అతరార్థ మేమిటి ?

జంబూ—అదే అందులోనే వుందిరా స్త్రీహృదయరహస్యం! చూచావూ! స్త్రీల్లో నాలుగుజాతులున్నాయని జంతుశాస్త్రకారులు పరిశోధనచేసి చెప్పారు. మనఅమ్మతారాదేవి సర్వశుభలక్షణ లక్షితంతైన గొప్పపద్మినీజాతి నారీమణి! చూడు, అగుడ్డిమహాఋషి- ఆవేపచెట్టుకింద గుడిసెలో వున్నాడే—ఆయన భార్య, సిసలైన శంఖినీజాతి ! మరి, ఏటిఒడ్డున, ఎప్పుడూ గార నూనెతో నిండి, తైలభాండంలో అప్పుడే ముంచితీసిన వత్తివలె పిచపిచ లాముగా వుంటాడే ఆ గూని మహాముని—ఆయనభార్య ఒకటోరకంహస్తిని ఇక మన శాంత- మన హృదయ ఆయస్కాంత- ఆశ్రమం మొత్తంమీద చిత్తినిగా చిత్తని !

అప్పుడు ఒక గడ్డిమోపు మూటతోనూ. చేతిలో ఒక చెర్నాకోలతోనూ శాంత ప్రవేశం. లంబూ జంబూలకు అర్థంకాక తల గోక్కుంటూ న్నారు. శాంత గడ్డిమోపు విప్పి వాళ్ళముందు గడ్డి వేస్తూ, చెర్నాకోలతో వాళ్ళను కొడుతుంది—

శాంతా లంబూ జంబూలకు తైలాగు పాట (7)

## దృశ్యం - అయిదు

నారదుడు - ప్రవేశం

నార- హాహాహా! అనుకొన్నంతయు నైనది.

మ. పదియున్నాలుగు దీర్ఘవర్షములు స్తబ్ధంబైన తారాసతీ
మదనోన్మాదప్రు లగ్గిగొండ, పృథుకంపాగుంఫితంబై, బదా
బద్దలై ప్రవస్సెడి వేళవచ్చె! నిక నా ప్రజ్ఞన్ని యోగించి కూ
ర్చెద పోరాటము, నందనందన! జయశ్రీ వేగ సంధింపుమా!

శచీ ఇంద్రుని యాహ్వానము. మాతలి యాగమనము—బృహస్పతికి దేవలోక ప్రయాణము ... తారకు చిరవాంఛిత ఏకాంతము ... ఇంకేమి కావలయు? మన్మధునకు కనకాభిషేకము!... అనంతరము నా కలహకార్యకలాపము... హాహాహా!...కాని, ఈఘట్టము నాధారముగా ఏవిధమైన కలహమును లేవనెత్తవగును? .. దేవదానవులకు ముడిపెట్టుదునా?... వలదు. అది అనవసర దారుణ రక్తపాతమునకు హేతువగును... ఔను... మంచి సమయమునకు జ్ఞప్తికి వచ్చినది. తనయొద్దనుండిన మృతసంజీవనిని కచునిద్వారా అపహరించినది మొదలు, శుక్రుడు బృహస్పతిపై కాలుములు మిరియుచు లంఘించుచు పగదీర్చుకొను వేళకై వెదకుచున్నాడు. భళిరే! ఉపాయము స్ఫురించినది ఇక నా కలహ బుభుక్షపూర్తిగా నుపశమించు సమయము ప్రాప్తించినది. కృష్ణా! ఆర్తజనావనా! నీయాశ్రితులకు ఎందును ఏకొరంతయుగలుగ నేరదనుట నిశ్చయము.

నారదుని పాట

---

# అంకం మూడు

## దృశ్యం - ఒకటి

బృహస్పతి కుటీరంలో.

బృహస్పతి కృష్ణాజినాసీనుడై జపమాల త్రిప్పుతూ వున్నాడు మరోద్వారాసంన నిండా మాతలి కూర్చొనివున్నాడు. అతని కాళ్ళు పళ్ళెంలో ఉన్నాయి. ఒక కలశంతో శాంతి నీళ్ళుపోస్తున్నది. తార కాళ్ళు కడుగుతున్నది.

తార- శాంతా!

శాంతి- అమ్మా!

తార- పూజామందిరంలోకి వెళ్ళి పూలకరండం తీసుకురా!

శాంత- చిత్తం. (శాంత నిష్క్రమణం)

బృహ- ఎవరక్కడ ?

లంబూ- (ప్రవేశించి) ఆజ్ఞయేమి గురుదేవా ?

బృహ- నీసహపాటి జంబుకేశ్వరు డెక్కడ ?

జంబూ- ఇక్కడేవున్నా గురుదేవా అంటూ (ప్రవేశము)

బృహ- శిష్యులారా ! ఈయన మహాభాగుడు — దేవేంద్రసారథి — మాతలి. ఈయన రాకచే మనయాశ్రమము నేడు నిక్కముగా పునీతమైనది. వీరియాగమునకు స్మరణచిహ్నముగా మీకెల్లరకు నేడు అటవిడుపు నొసంగుచున్నాను. మీరేగి శిష్యులకెల్లరికి శుభవార్త తెలిగించి యన్యమనముల నాలించి క్రీడావినోదముతో నానందించుడు పొండు.

లంబూ | జంబూ | మహాభాగ్యం గురుదేవా !

(లంబూ జంబూలు నిష్క్రమణం)

(శాంత పుష్పకరండంతో ప్రవేశం)

తార- (కరండంలోని పుష్పాలతో మాతలి కాళ్లను పూజిస్తూ పూజాగీతం పాడుతుంది)(8)

మాతలి- సుమంగళీభవ ! దీర్ఘసుమంగళీభవ !

తార- తరించితిని ఇంద్రసారథి ! ధన్యజీవితనైతిని.

(నమస్కరించి తార శాంతతో నిష్క్రమణం)

మాతలి- దేవర్షిచంద్రా ! సౌశీల్య తేజోరాశియగు తారాదేవికి భర్తలగుటచే మీకీర్తికి మరింత వన్నె ఘటించె.

బృహ- మాతలీ ! నీయభివాదములకు కృతజ్ఞుడను. ఇక నింద్రలోకము నందలివిశేషము లెట్టివో చెప్పెదవా ?

మ. సేమమె పాకశాసనునికి ? సేమమె సర్వసుపర్వకోటికిన్ !
సేమమె యాసుమంగలికి శ్రీసచికిన్ ! సుఖుడే జయంతుడు
ద్దామ పరాక్రముండు, వనితాజనకానవమోహనుండు ? నీ
కామితమేమి ? రాదగిన కారణ మేమి ? వచింపు మాతలీ !

మాతలి- అష్టదిక్పతులు సేవింపగా నఖండసుధర్మ సింహాసీనుడై జగజ్జాలంబులు శాసించు మీప్రియశిష్యుడు మహేంద్రుడంపగా వచ్చినాడను. అచ్చటనెల్లరకు కుశలము బ్రహస్పతీ ! అఖిల విద్యావాచస్పతీ !

శా. క్రతువొక్కండొనరింపఁగా మదిని సంకల్పించియున్నాడు, తత్
క్రతునధ్వర్యము నెల్లఁదా నక భుజస్కంధమ్ముపైఁ బెట్టినా
డతిశీఘ్రమ్మున మిమ్ము దోడుకొని రమ్మన్నాడు మీశిష్యు. డో
యతిచంద్రా! యరుదెంచి యాతని కభీష్టావాప్తి సంధింపవే!

బృహ- మాతలీ! శిష్యుని సందేశమున కానంద భరితుడనైతిని. అతని మహదాశయము సత్వరమే ఫలించుగాక.

మాతలి- భగవన్! రాబోవు పూర్ణిమయే క్రతు సుముహూర్తము. కాల మవ్యవధిగా నున్నది. క్రతు నిర్వహణమునకై సేయందగు కార్యకలాప మంతయు మీరాకకై యెదురు చూచుచున్నది. కాబట్టి మిమ్ము నేడే దోడ్కొని రమ్మనుచు నన్ను విమాన సహితముగా బంపినాడు.

బృహ- మంచిది. ఆట్లేయగుగాక! మేమొసగు నాతిథ్యమును స్వీకరించి ప్రయాణ శ్రమముగొంత యపనయించుకొని ఈ సాయంతనమే నన్ను తోడ్కొని పోవుదువు గాక. రమ్ము. రమ్ము. ఈవార్తను తారకెరింగించి, ఆమె నొడంబరచి పోవుటకై యత్నింప వలసియున్నది. అక్కటా! తారా!

చ. అగనిముసంబు నన్ను విడనాడగనోర్వవు ముద్దురాల! నా
చరణ సరోరుహార్చనయె జన్మకు సత్ఫలమంచు నమ్మినా
ఇరువురమధ్యగల్గిన వయో విపరీతము లేశమాత్రమే
నరయగలేని బేల వకటా! యెటు నిన్నిడి పోవనేర్తునో!

మాతలితో బృహస్పతి నిష్క్రమణం.

---

## దృశ్యం — రెండు

బృహస్పతి కుటీరములో మరోవైపు

చంద్రునిమీద ప్రేమనుండి తప్పించుకు పారిపోవాలని ఊహించి, తార తానుకూడా ఇంద్రలోక ప్రయాణమునకు సిద్ధపడుతున్నది. కూనరాగం తీస్తూ పెట్టెబేడా సర్దుకుంటున్నది.

### పాట (౯)

తార- (సర్దుతూ) లంబూ! లంబూ!

లంబూ- (ప్రవేశించి) అమ్మా! ఏమిటమ్మా!......ఇదేమిటి? ఈ ప్రయాణసన్నాహం ఎక్కడికి?

తార- చూడు! ఆ...వట వృక్షానికి అరగట్టిన అవటినారచీర తీసుకురా! తొందరగా పో? ఊం.

జంబూ- చిత్తం. చిత్తం. (నిష్క్రమణం)

తార- (మళ్ళీసర్దుతూ) మరచిపోయా ! ఒరేయ్ జంబూ ! జంబూ !

జంబూ- (ప్రవేశించి) అమ్మా ! ఏమిటాజ్ఞ !......ఇదేమిటి ? ఈప్రయాణసన్నాహం ఎక్కడికి ?

తార- చూడు ! ఆ......తోటలోనికిపోయి కొన్ని మల్లెలూ జాజులూ పొగడలూ కోసుకురా ! తొందరగా రావాలి సుమా !

జంబూ- చిత్తం. చిత్తం. (నిష్క్రమణం)

తార- (మళ్ళీ సర్దుతూ) శాంతా ! శాంతా !

శాంత- (ప్రవేశిస్తు) అమ్మా ! పిల్చారానన్ను ?.........ఏమిటీ సన్నాహ మంతా ఎక్కడికి మీప్రయాణం ?

తార- శాంతా ! నాకేజయం, నీకే పరాజయం !

శాంత- అసలు గొడవ యేమిటమ్మా ?

తార- నీవు వినలేదా ?...... శాంతా ! యజ్ఞం ఇంద్రుణ్ణి చెయ్యబోతున్నది.

శాంత- ఏమిటి ? ఇంద్రుడు యజ్ఞం చెయ్యబోతున్నాడా ? యజ్ఞం ఇంద్రుణ్ణి చెయ్యబోతున్నదా ?

తార- మాతలి వచ్చాడు. చంద్రుణ్ణి రమ్మన్నాడు. నేనూ వెళ్ళిపోతున్నా.

శాంత- మాతలి చంద్రుణ్ణి రమ్మన్నాడా ? !

తార- చంద్రుణ్ణా !...కాదు. పొరపాటు ! నా భర్తగారిని......

శాంత- అయితే ?

తార- అయితే యేమిటి ? ఇంద్రలోకానికి నేనూ భర్తగారితో వెళ్లిపోతా. ఆయన వద్దన్నాసరే వెంటపడేతా.

శాంత- వారు రమ్మన్నారా !

తార- ఎవరు ?

శాంత- మీభర్తగారు.

తార- యింకా నాతో చెప్పలేదు.

శాంత- మరి ?

తార- వారువద్దన్నాసరే నేనూ వెంటవెడతా. ఇక ఈఆశ్రమంలో ఒక క్షణమయినా ఉండను—

శాంత- ఎందుకని ?

తార- శాంతా! నీకు సర్వము ఇంతకుముందే చెప్పితిని కదా.

చ. కొడుకని చేరదీసితిని, కూరిమిజూపితి, తల్లిఖోలెనే

కుడువగ బెట్టితిన్, మెలకు గోచతలు జుట్టితి, నీళ్లువోసితిన్

చెడుతుల పిన్నినాళ్ళ మది చేరగలేదిపు డేమి వింతయో
యుడుగని తప్పుపోకడల ముజ్జటలాడెను స్వాంతి మక్కటా !

శాంత- అయితే యిప్పుడేమి చేయదలచినారు ?

తార- దొంగ వస్తున్నాడని తెలుసుకొని యేమిజాగ్రత పడాలో ఆజాగ్రత్తే పడుతున్నా.

తార- ఏమిటా జాగ్రత ?

శాంత- శాంతా !

చ. అవిరళమోహ సంక్షుభితమై, యతిరేక పథానువర్తియై,
పవలును రేలు చందురునిపై బరువెత్తుట మానకున్న దీ
యవగుణ చిత్తవృత్తి ! పతియా పరదేశము లేగుచుండె ! నే
మవుదునో ? నాకునేనె హృదయమ్మును నమ్మగజాల నోసఖీ !

శాంత- కాబట్టి చంద్రుణ్ణి మరచిపోవడానికి ఈ ఆశ్రమంనుంచి పారిపోవాలని సంకల్పించుకున్నారు. అంతేనా ?

తార- ఔను.

శాంత- (పకాలున నవ్వుతుంది) అమ్మా ! మీరు ఇప్పుడున్న ఉన్మాద చిత్తవృత్తికీ మీరుచేసిన ఆలోచనకీ సరిగ్గా సరిపోతుంది.

తార- కాంతా !...అదుగో నాభర్తగారె వస్తున్నారు. !

బృహ- (ప్రవేశించి) తారా!.. ఏమిది ఎక్కడికీ ప్రయాణసన్నాహము ?

తార- కాదు...అబ్బే—మరి..... ప్రయాణమూ కాదు...... సన్నాహమూ కాదు .. ఏమితోచక ఊరికే సర్దుతున్నా... సరే కాని నాధా .. ఇంద్రలోక విశేషము లేమి ? మాతలి ఏమైనా సందేశం తెచ్చాడా ?

బృహ- ఔను. అతడొక యజ్ఞముచేయ సంకల్పించి నన్ను వెంటనే తోడ్కొనిరమ్మని మాతలిని విమాన సహితంగా బంపినాడు.

తార- అయితే, ప్రాణేశ్వరా ! మీరు వెళ్ళక తప్పదా ?

బృహ- యోగ్యురాల ! వెళ్ళక తప్పించుకొను వెరవులేదు—

శా. ముల్లోకంబుల నేలు రాజుసవనంబుల్ దీర్ప రమ్మన్నచో,
నుల్లంఘింపగరాదు గావున దురుద్యోగంబు గావించి, సం
పల్లాభంబున వేగవత్తు భవదాత్మన్ ఖేదమున్ జెంది కే
లుల్లున్ వాకిలి జూచుకొందు మను మింతీ కొంతకాలంబికన్ ॥

తార- నాథా! ఇక్కడ నేనుండను. మీవెంబడి నన్నుగూడా తీసుకొనిపొండి.

బృహ- తారా! చీటికి మాటికి భర్తలు భార్యలను వెంటగొనిపోవుట అంతసమంజసము కాదు. అదిగాక, స్వర్గము-స్వర్గము అని యందురే గాని స్వర్గమునందుకూడ నొపగులు లేకపోవు సుమా.

తార- నిజంగానా ?

బృహ- ఔను తార.

క. "నటవిట వారవధూటీ
పటలీ సంవృతము స్వర్గపట్టణ మకటా!"
కుటిలాలక! నీవట కే
గుట యుచితముకాదు! మానుకోవే! తారా!

తార- అయితే భగవన్ స్వర్గంలోకూడ ఉన్నవా యిలాటి లోపాలు ?

బృహ- ఔను తారా! లోకవృత్తమెరుగని ముద్దరాలవు. ఏమని నీతో చెప్పుదును ! స్వర్గమని పేరేగాని—

సీ. అల యహల్యా జారుడై వేయికన్నులు
తెచ్చుకొన్నట్టి యా(ముచ్చు ప్రభువు!
ఇంద్రభోగం బని యెల్లరు గీర్తించు
సుఖలౌల్య మాతని క్షుద్రవృత్తి !
అమృతమ్ము పేరుతో నవతార మెత్తిన
పులికల్లు వాని కొపాసనమ్ము!
కళల పేరిట దినమొలల వర్తించెడు
రంభాదు లతనికి రాత్రి సఖులు!
రాజె యిట్లుండ ప్రజలవర్తన మికేల ?
పలుకుగాత పురాణముల్ చిలుకలవలె!
మర్త్యుడై చచ్చి యొకరెం! యమర్త్యుడగుచు
బ్రతికి యొక్కటె ! తార! వర్తనములేక !

తార- ప్రాణేశ్వరా! సరే ఆ పాడులోకానికి నేను రాను. ఈఆశ్రమమే స్వర్గ మనుకుంటాను. కాని అలాగా నేను మీవెంట వచ్చుటే శుభావహమని అనుకుంటున్నా... శాంత! నీవుచెప్పు. ఉండనా ? లేక ప్రాణేశ్వరునితో వెళ్ళిపోనా!

శాంత- అమ్మా! దీనికింత ఆలోచన యెందుకు ? మీకు ఏదిస్వర్గముగా కనబడుతుందో అక్కడనే ఉండండి.

తార- అదికాదే! నాధుని విడనాడి యెలా ఉండగలను ?

శాంత- విరహబాధ దుస్తరమనేమాట నిజమేనమ్మా !

తార- విరహముకాదే! నాధుడు అక్కడికి పోవుట నాకు ఏంతమాత్రం ఇష్టంలేదు.

శాంత- అక్కడ రంభాదు లెవరైనా మీ నాధున్ని......

తార- ఛీ. ఛీ. నా నాధుని కట్టి ప్రసక్తిలేదు. నాకు తెలుసు.

బృహ- తారా! నేను త్వరగా రానని నీభయమా ?

తార- (నిశ్చలంగా)....నాధా!......

బృహ- తారా! ఇంతలో ముఖవైఖరి మారినదేల ? నీహృదయమును వ్యాకులమొనరించుచున్న విషయమేమో చెప్పుము——తారా!

తార- నాధా! త్రికరణశుద్ధిగా చెబుతున్నా వినండి! నేను దాచను—దాచలేను. (గద్గదంగా ఏడుస్తుంది)

బృహ- ఏమది తారా ? తారా!......శాంతా! నేడెందులకో తార యింతదిగులుగానున్నదేల ?

శాంత- భగవన్! మీవియోగాన్ని ఎలా సహింతునా అని బెంగపెట్టుకొని ఏడుస్తున్నది

బృహ- "దాచను - దాచలేను" అనుచు నేదోవిషయమును గురించి వ్యాకులపడినట్లున్నది ఎట్టిదా విషయము ?

తారం- (యింకా ఏడుస్తూనే ఉంది)

శాంత- మీరు గ్రహించుకోలేదా ? భగవన్! మీతో రావాలని ఈనె దృఢసంకల్పం మీరు తప్పకుండా తీసుకువెడతారనే నమ్మకంతో (సర్దిన సామానులేసి చూపిస్తు) చూడండి

బృహ- ఓహో! అర్ధమైనది. తారా! ఏడవకు. యిటురా. తారా! నీకు ఆశాభంగం కలిగించినందుకు విచారించుచున్నాను. కాని, తారా! నీవునూ నేనునూ లేని యెడల ఈ ఆశ్రమము గతి యేమి కావలెను ?

ఉ. "ఇచ్చటి యగ్నిహోత్ర తతు లెవ్వరి పా లతిధి వ్రజంబులకా
వచ్చిన యాప్తబంధుల ఘనంబున నెవ్వరు పూజసేయు వా ?
రిచ్చటనున్న శిష్యులకు నేగతి ? నన్నెడబాయలేని బల్
మచ్చిక నీవు వచ్చిన బలా ! అబలా ! ప్రబలాఘ మంటదే !"

తార- సరే. భగవన్! మీ యాజ్ఞ యట్లో అట్లే యగుగాక !

బృహ- తారా ! మరొక ముఖ్యవిషయము.

చ. "వయసున బాలుడయ్యు ఋజువర్తనులో గడు పెద్ద చంద్రమ, కాం
తయు గృహకృత్య వర్తనల నన్మరపించును నిచ్చలుం , సుహృ
దయమున నెండ వానలకు దాగజాలడు, నీవు లేక త
ప్రియము ఘటించువారెవరు ప్రేయసి! సుంత తలంచనాడుమా"

శాంత- దివ్యవాక్యం సెలవిచ్చారు భగవన్! తారలేని చంద్రుడూ నీవులేనిమిమ్మా ఒక్కటే

తార- మంచిది భగవన్! మీయాజ్ఞ నౌదల ధరియించి యుండే యుంటేవరకు మీరు వచ్చేదాక నాభాధ్యత లన్నిటినీ త్రికరణశుద్ధిగా నిర్వహించుకోడానికి గట్టి ప్రయత్నం చేస్తా! నాథా! (మోకరించి)

ఆ. వె. మీ పరోక్షమందు మిమ్ముగా భావింతు
విషయ సంగమెల్ల విస్మరింతు
చిత్తమొక్కచోట జేరిచి పూజింతు
పాదరక్షలివె! ప్రాణనాథ!

బృహ- ఆనందము! (పాదుకలు యిస్తూ) మహదానందము! (తార వాటినికళ్ళకు అద్దుకుంటుంది నెత్తిమీద పెట్టుకుంటుంది.)

శాంత- (స) ఇది అభినయమా? లేక నిజమా? నాకు అర్థం కావడంలేదు.

(మాతలి ప్రవేశం)

మాతలి- భగవన్! విమానము సిద్ధముగా నున్నది.

బృహ- ఇదే వచ్చుచున్నాను. తారా! సెలవు! శాంతా! సెలవు.

(అంతా నమస్కారాలు చేస్తారు)

బృహస్పతిని పంపుతూ అందరూ కోరస్ పాట పాడుతారు (10)

— —

## దృశ్యం - మూడు

బృహస్పత్యాశ్రమం వెలుపల ఒకబాట.
లంబూ, జంబూ, చంద్రుడు ప్రవేశం.

లంబూ- చూశావా! చంద్రుడూ! అదృష్టమంటే అలా కలసిరావాలి!

చంద్ర- ఎవరికి?

జంబూ- ఒకరి కేమిటి? ఎవరికైనాసరే.

చంద్ర- విషయ మేమి ?

లంబూ- ఇంతకంటె యేం కావాలి ? బృహస్పతి భగవాన్లు పరదేశ వెళ్ళిపోయారు

జంబు- ఆశ్రమానికా యాజమానిలేడు -

లంబు- ఇప్పుడంతా స్త్రీరాజ్యం ఆరంభ మైంది.

జంబు- స్త్రీలమీద నీ రాజ్యం ఇదివరకే ప్రారంభమైంది.

చంద్ర- స్నేహితులారా ! నాలించుడు. మీఅసభ్యపసుగ్రము ?

లంబు- చంద్రా! నిజంచెప్పు. లంబు జంబుల నెత్తిమీద పిడుగుపడినా అయ్యోఅనేవాళ్ళు కనబడరు. నీమీద అలా గాలివిసిగితే నాలు ఆశ్రమంలోవున్న ఆడవాళ్ళంతా ఆలో లోలో అని పరుగెత్తుకు వస్తారు. ఇంత పక్షపాతానికి కారణం ఏమైవుంటుంది అంటా ?

జంబు- కారణమేమిట్రా ! ఆశ్రమానికంతా చంద్రగ్రహణం పట్టిందిరా ! చంద్రగ్రహణం !

చంద్ర -అయ్యోయ్యో ! జంబుకేశ్వరా ! పవిత్రమగు బ్రహ్మచర్యాశ్రమము వాచరించు మన కీలాటి ప్రసంగము తగునా ?

చ. గురుడు జగద్గురుండు - మనకున్ గతజన్మల జేసినట్టి స
త్కారణ ఫలంబుగా దొరికె — గాలము స్వల్పము – విద్య మేటి సా
గరము, తరింపగా వెరవుగన్గొను టొప్పుగుగాని, నిత్య మీ
కరణిని యాంధ్రడ ముచ్చటల గాలము బుచ్చుట మేలె ? మిత్రుడా

జంబు- ఒరేయ్ లంబు ! మనవాడు నిజంచెప్పడానికి ఇష్టంలేక వేదాంతో పన్యాసాలు ఆరంభించాడు

చంద్ర- సహాధ్యాయులారా ! ఈప్రసంగము కట్టిపెట్టనియెడల నేను పోయెదను. నేడు మీరు మీపాఠము ఒప్పగింపలేదన్న విషయము స్పష్టియుందుంచుకొని గురువుగారు తిరిగి వచ్చిన వెంటనే యెరుకగింతును. తర్వాత నన్ను నిందించిన ప్రయోజనము లేదు. పాఠము లప్పగింతురా ? లేక నన్ను పొమ్మందురా

లంబూ, జంబూ - సరే. ఉండు అప్పగిస్తాం

లంబూ -ఇవ్వాళ పాఠం ఏమిట్రా జంబు ?

జంబు- నాలుగో అష్టంలో మూడో మంత్రం కాదటరా !

లంబు- అయితే - నువ్వే మొదలు అందించు.

జంబు- సరే. చంద్రా! అప్పగిస్తాం విను !- ఓమ్!

లంబు- ఓమ్

జంబూ—కాంతా ఇతి కాంతా—
లంబూ—అధర మిత్యధరం—
జంబు—మధుర మితి మధురమ్—
లంబు—ఓమ్ త త్సత్యమ్—
జంబు— సత్య మితి సత్యమ్—
లంబూ- ఓమ్ త దాత్మా-
జంబూ- ఆత్మా ఇ త్యాత్మా-.
లంబూ- త దేవ బ్రహ్మమ్-
జంబూ- బ్రహ్మ మితి బ్రహ్మమ్-
లంబూ- కాంతా అధరమ్ మధురమ్-
జంబూ- శాంతా అధరం మధురం-
లంబూ- ఓమ్.
జంబూ- ఓమ్-
లంబూ- సర్వమ్ చంద్రార్పణమస్తు!
జంబూ- శాంతిః-
లంబూ- శాంతిః-
జంబూ- శాంతిః.

చంద్ర- హరిహరీ! పాపము! శాంతించు గాక! (అంటూ చెవులు మూసు కొని వెడుతూ వుంటే లంబూ జంబూలు పెద్ద పెట్టున నవ్వుతూ అతణ్ణి తరుముతూ నిష్క్రమిస్తారు.)

---

## దృశ్యం - నాలుగు

బృహస్పత్యాశ్రమం లోపల పూజా మందిరం

తార తన నాథుని పాదుకలను పూజావేదిక పై పెట్టింది వాటిముందు కూర్చుంది. మనస్సు కుదరడంలేదు. లేస్తుంది.

తార- ఓ పాదుకలారా! పరదేశమందున్న నాభర్తకు ప్రతినిధులై వెలసిన పవిత్ర చిహ్నములారా! నాబాధ యెవరితో చెప్పకోగలను! ప్రపంచానికి దయ లేదు.

ఓపిక లేదు. కాని హృదయం శిలాకర్కశం మీకే నివేదించుకుంటూ నా గోడు వినండి !

సీ. పడతికి నాథుడే ప్రత్యక్షదైవం బ
టన్న పెద్దలసూక్తి నవగణించి
సీతాసావిత్ర్యాది సీమంతినుల మహో
మహిమాన్వితి కథాళి మరచిపోయి
మచ్చలేనట్టి యీనాని, వంశము కీర్తి
పాడు సేయుదునన్న భయము వీడి
మూడు నిమేషాల ముచ్చటకై సదా
నరక వాస మటన్న వెరుపు తొలగి
దైవమిచ్చిన బుద్ధిని తప్పద్రోచి
రేయొడలికి గులామునై పోవుచున్న నన్ను
దయదలంపక దారుణ దారుణముగ
శిక్ష సేయరే ! పతి పాదరక్షలార !

ఛీ ! నాయాత్మను నిగ్రహించుకోవాలె గాని ఈ విధంగా ఉపాయాంత్రాలకోసం వెతుకుట నావంటి విద్యావతికి అకార్యం. ఔను అర్థమైంది .. ఆ చంద్రుని వంకకు నన్ను బలాత్కారం చేస్తున్నది నా మనస్సు కాదు... ఈ దేహం ! దుర్గంధ పంక పంకిలమైన ఈ మాంసగోళం ! ... ఔను .. నా లోపం తెలుసుకున్నా !... నారహస్యం నాకిప్పుడు తేట తెల్లమైంది

చ. మనసది వెన్కలాగ, మదమత్తగతిన్ మునుముందు దూకు నీ
తనువును నిగ్రహించెదను ! తాలిమి రాయిక !—

(పకపకా నవ్వుతుంది) నేనెపో, సమ

ర్థను ! సదద్విచార సహితన్ ! గులకాంతను ! మేలుకొంటి!—

(మళ్ళీ నవ్వుకుంటుంది. చివరకు తీవ్రంగా) ఓ

చెనటి! పిచాచి! చంద్ర! నిరసింతు! జయింతు! త్యజింతునిన్నికన్!

(తెల్పానుకదా అనుకొని తనలోతానే నవ్వుకుంటూ) ఏవీ! ఏవీ! నాహృదయేశ్వరుని పవిత్ర పాదుకలు! (తీసుకుంటుంది-కళ్ళకు అద్దుకుంటుంది. ఇంతలో ఒకఆలోచన కలిగింది) ఉండు! ..ఉండు!...ఔను! ఔను! ఈ పూజామందిర ద్వారము లన్నింటిని బంధించెద! బహిఃప్రపంచముతోగల రాకపోక లన్నింటినీ నిరోధించెద! ఔను! . ఎవరక్కడ? ఈపూజామందిరం నాది! నాకు నా పతి పాదుకలకూ తప్ప ఇక్కడ మరెవ్వరికి చోటులేదు!...పొండి! ఊఁ విన్నారా! ఇదిపవిత్రమైన ఋష్యాశ్రమం. నాభర్త జగదేక బ్రహ్మజ్ఞాని. నేను సర్వవిద్యా సకల సౌభాగ్య సంపన్నురాలను! మీరు ఐహిక వాంఛా దాహ దగ్ధులైన భ్రష్టులు! మీ ముఖ సందర్శనం మహాపాతక హేతువు! పొండు! పొండు! పొండు! (అంతా ఉద్రేకంతో నిష్క్రమించి తలుపులు పెద్దచప్పుడుతో మూసివేసి మళ్ళీప్రవేశిస్తూ) హాహాహా! ఏవి! ఏవీ! నాప్రాణేశ్వరుని పవిత్ర ప్రతినిధులు! (వాటిముందు కూర్చుంటుంది. ధూళి దులుపుతుంది ప్రమిదతో వత్తి యెగవన దోయబోయి వేళ్ళు కాల్చుకుంటుంది గంట అనుకొని కలశాన్ని ఎత్తి మోగించ బోతుంది. ఇలాటి అవస్థలోనే హారతి వెలిగించి పాట పాడుతుంది)

## గీతం

భర్తయే దైవమ్ము భార్యకీ యిలలో
వట్టి మాటలు గావు వాస్తవము సుండీ!
మగడు వృద్ధుడని తెగడ బోకండీ!
తెగడినా ఫల మేమి? మగడె గతి యండీ!
బ్రతుకులో ఆనంద మున్నా లేకున్న
మనసులో జ్యోతి ఆరినా ఆరకున్నా
భావాల తోట పూచినా పూయకున్నా
వలపు వెన్నెలలు కాచినా కాయకున్నా
లోకమ్ము చేసిన లోపం బదేమి
నీ కర్మయే గాక విర్భాగ్యనారీ!

(హారతిపళ్లెం దించుతుంది, పాదుకలను ఎత్తుతుంది. వాటికేసి తీవ్రదృష్టితో చూస్తూ)

నాథుడే సత్యమని నమ్మే ప్రతివ్రతలకు పతి పాదుకలలో కూడా పతిస్వామే ప్రతిబింబించాలికదా! మరి- నా పతివ్రతమేది! (పాదుకలకేసి తేరి పార చూస్తుంది చంద్ర విగ్రహం కనిపిస్తుంది. ఉలికిపడి కళ్లు మూసుకుంటుంది మళ్లీ చూస్తుంది. మళ్లీ కళ్లుమూస్తుంది.) ఆఁ చంద్రుడు! చంద్రుడు! (పాదుకలను విసరి పారేస్తుంది. హారతి పళ్ళెం ఎత్తి చూస్తుంది. అందులోనూ చంద్రుడే కనబడుతాడు. విసిరి పారేస్తుంది ఈసారి కలశం- అందులోనూ చంద్రుడే! పూవులు - అందులోనూ చంద్రుడే! జ్యోతి- చంద్రుడే! అర్ఘ్యపాత్ర- చంద్రుడు! అన్నిటినీ విసిరికొట్టి) ఛీ! ఛీ! నానిష్ఠ - దీక్ష - నిగ్రహం సర్వం నిర్మూలం! .. అబ్బబ్బ! ఈకృత్రిమ వ్యవస్థను ఇక సహింపలేను. నన్ను నేనే మోసగించుకుంటున్నా లోపల ఒక జీవితం పైకి ఒక జీవితం నటిస్తున్నా! .. ఔరా!

ఉ. పొందుగ గూరుచుండి పతిపూజ నొనర్చెడు వేళ, పూలలో
చందురు! డంతరంగమున జంద్రుడు! జ్యోతి కరండ దీపికన్
జందురు! డర్ఘ్యపాత్రయున జంద్రుడు? హారతి పళ్లెరంబునన్
జందురు! డల్లపాదుకల జంద్రు? డిఁకేమి యొనర్తునక్కటా!

(అప్పుడు "తలుపు! తలుపు!" అంటూ తెరలోనుంచి జంబు కేకలు వేస్తాడు)

తార- ఎవరు?

(తెరలో - "తలుపు! తలుపు!")

తార- తియ్యను.

(తెరలో - "తలుపు! తలుపు!")

తార -తియ్యను. తియ్యడానికి వీలులేదు।

(తెరలో - "తలుపు। తలుపు।")

తార- ఎవరు నీవు?

(తెరలో - "నేను జంబు కేశ్వరుడ నమ్మా!")

తార -పో।

(తెరలో - "అది కాదమ్మా। చాలా ప్రమాదం జరిగింది।"

తార- ప్రమాదమా?..........ఎవరికి?

(తెరలో - చెప్తాను. ముందు తలుపు తియ్యండి!")

తార- ప్రమాదం?....... ...........చంద్రునికి కాదుగదా। చంద్రా ।......

అంటూ గభాలున పోయి తలుపు తీసి జంబుతో
మళ్ళీ వస్తుంది.

తార -ప్రమాదం ఏమిటి ? ఎవరికి ? తొందరగా చెప్పు !

జంబు -ఉండండమ్మా. కొంచెం ఊపిరితీసుకోనియ్యండి .. సంగతి ఏమిటంటే... మొన్న

తార - మొన్నటి సంగతు లెందుకురా ? ఇప్పుడేమి జరిగిందో చెప్పు !

జంబూ- అదికాదమ్మా ! మొన్నతో ఆరంభించిస్తేనే గాని మీకు ఇప్పటి విషయం బోధపడదు. మొన్న ఒక దొంగ పెద్దపులి వచ్చేసి మన ఆశ్రమంలో దూరి రెండు కోడెదూడలను లాక్కుపోయించనే విషయం మీజ్ఞాపంలో వుందా ?

తార- ఔను. ఔను.

జంబూ- అమ్మా !...మరి - పెద్దపులి జాతిలో పిల్లులు పుడుతాయా? లేక పిల్లిజాతిలో పెద్దపులులు పుడతాయా ?

తార- మూర్ఖుడా ! అసలు విషయం చెప్పు ?

జంబూ- అఁఅఁ. క్షమించండి. ఆ పెద్దపులి - ఇవ్వాళ్- అంటే- ఇంతకు ముందే వచ్చింది. దాని కిర్మంజాలకి అది నా కేకనబడింది ..

తార- తొందరగా చెప్పరా !

జంబూ- వెంటనే పరుగెత్తుకుపోయి చంద్రుణ్ణి తీసుకొచ్చా.

తార- చంద్రుణ్ణా !... అయ్యో తర్వాత ?

జంబు- ఒక చేతిలో విల్లూ- మరో చేతి లో బాణం- ధరించి- చంద్రుడు వస్తుంటే అహాహా ఎంత జగన్మోహనంగా వున్నాడని చెప్పను! అబ్బబ్బా! అసుమాస్త్రుడు - ఆ ఆనందుడు- ఆరతినాథుడు-అంటే ఆమన్మథుడు- వాడి తాతలాగా ఉన్నాడు మన చంద్రుడు !

తార- సంతోషమే !... కాని ప్రమాద మేమిటో చెప్ప వేం ! తొందరగా !-

జంబూ- అప్పుడు మనచంద్రుడు, యాద్రేష రతీనాథుడు, గభాలున విల్లెత్తి- గుభాలున బాణమ్ము విడువగా- దభాలున శార్దూలమ్ము ధరణిపైబడి కాళ్ళు పైకెత్తేసింది

తార- ఏమీ ! చంద్రుడు పెద్దపులినిచంపాడా!... ఆహా !... కాని, ప్రమాదం సంగతి చెప్పవేమి ?

జంబూ- అంటే- దాన్ని తరుముకు పోతగావుంటే జొన్నమోడొకటి కాలికి రాసుకు పోయి, రవ్వంత పెచ్చూడిపోయి, కొంచెం నెత్తురు కారింది. అరుగో అరుగో ! లంబూ చంద్రుడూ ఇక్కడకే వస్తున్నారు ! చూడండి ! !

అప్పుడు లంబూతో చంద్రుడు ప్రవేశం. విల్లమ్ములతో
కనిపిస్తున్న చంద్రుడు మరీ జగన్మోహనంగా వున్నాడు.
కాలిమీద కొద్దిగా నెత్తురు మరక లున్నవి.

తార- చంద్రా! ఏది ఏది! నీగాయం చూడనియ్! (కూర్చుంటుంది. గాయం చూస్తుంది, నఖాలున చీరలో ఒకపీలిక చింపి, కాలుకు కట్టుకడుతూ) చంద్రా! ఎంత ప్రమాదం జరిగింది? ..ఇలాంటి అపాయకర వ్యాసంగాలు ఎందుకునీకు?... ఆపెద్దపులి ఎదురు తిరుగుతే ఎంతకష్టం!... లంబూ! జంబూ, వీడు చాలా అలసిపోయి వున్నాడు. మంచి విశ్రాంతి అవసరం కావలసిన సపర్యలన్నీ నేను చేస్తా, కొంచెం నెమ్మదించిన తర్వాత మిమ్ములను పిలుస్తా అందాకా ఇక్కడికి రాకండి - పోండి!-

లంబూ- అమ్మా! ఇప్పుడు జ్ఞాపకం వస్తున్నది. ఆగాభరాలో నేనూపడిపోయానమ్మా!

జంబూ- నేనూకూడా పడ్డానమ్మా!

తార- సరే. మీరుకూడా విశ్రాంతి తీసుకోండి. పోండి!

(ఇష్టంలేని వైఖరితో ఇద్దరూ నిష్క్రమణం)

తార- చంద్రా! శార్దూలమును సంహరించేటంత వీరాగ్రణి వయ్యావా? ఏదీ ఏదీ! నీ వీరవిగ్రహాన్ని కనులారా చూడనియ్! ఏదీ! ఆవిల్లు పట్టే సొగసు, ఆ అమ్ము తొడుగు నీటు, ఆ అలీఢపాదం, ఆ వీరావేశ సౌందర్యం, ఏదీ ఒక్కసారి చూపించు!

చంద్ర- అమ్మా!...

తార- (ఉలికిపడుతుంది)

చంద్ర- అట్లులికిపడితివేల!

తార- చంద్రా! నిన్ను వేడుకుంటున్నా ఈక్షణంనుంచి నన్ను అమ్మాయని పిలువకు.

చంద్ర- నేడు నాపాఠము లింకను బూర్తికాలేదు- మనసంతయూ ఆ వ్యాసంగములో నున్నది ఈపూటకు నాకు సెలవిచ్చి పంపండి.

తార -మనసంతయు విద్యావ్యాసంగముపై నున్నదా!.....చంద్రా! నీకు మనస్సనేటుందా? .. ఉంటే ఈసమయంలో అక్కడికెలాపోయిందీ?

చంద్రా -మీపరిసంగము వినుటకు నాకేమోభయమగుచున్నది. మీవైఖరికూడా...

తార -ఔను. చంద్రా! నాచేత చెప్పించాలని దొంగవేషం వేశావే కాని, నీకు అర్థంకాని రహస్యమేముంది? చంద్రా! ఇక దాచను దాచలేను!

చ. అతితరమైన ప్రేమ, హృదయమ్మున నన్ని దినాలనుండి యు
ద్ధతి చెలరేగె - నిందనక దాచినా చెంగున నిప్పువోలె! నా
పతి పరదేశ మేగె, చిరవాంఛిత సత్ఫల సాధనంబుకై
జతనము కూడె నేటికి, విచార మికేటికి మారసుందరా!

చంద్ర- తారదేవి !......

తార- ఏమి? ఏమి! మళ్ళి ఒక్కసారి సుధామధుర స్వరంతో నా పేరు ఉచ్చరించు

చంద్ర- తారదేవీ! ఈయసద్వర్తనము మీవంటి విద్యావంతులకు అనుచితము.

తార- అయితే, చంద్రా! విద్యవున్నందుకు చేయదగినది వైరాగ్య స్వీకారమేనా?

చంద్ర- కాదు. న్యాయవిచారం - పాపభీతి - సంఘ నియమం-

తార- ఇంతేనా? ఇంకను కలవా?

చంద్ర- ఆముష్మికచింత - నరక భీతి!

తార- అగు! నరకభీతియా? నరకభీతి చంద్రా! నరకమంటే ఏమిటో ఊహామాత్రంగా నీకు తెలుసు - అనుభవపూర్వకంగా నాకు తెలుసు!

చ. అరువదియేండ్ల వృద్ధునకు నన్నుయిడచ్చి నికృష్ట నీరసా
వరణములో నిరాశల ప్రవాసము చేసెదు వాని కేండి యు
ర్వరబడు పండుటాకునకు ప్రౌఢవయస్క-శిరీషపుష్ప సుం
దర సుకుమార-మూలగుటె నారకనారక మోయి చంద్రుడా!

చంద్ర- హరిహరీ! యట్టి యుపహాస వాక్యము లాలించుచుంటివి- తారాదేవీ? మోహాతిరేకమున మీ వివేకము సంకుచితమైనదే గాని--

చ. "వికల నరిత్రుండైన, కుది వెంగలియైననుఁ, గూరిపి యైననుర్
ద్రికరణ శుద్ధిగా మగఁడె దేవుఁడటంచు నిశ్చయించి, యొం
డొకఁ డెటువంటి వాడయిన నొప్పదు కోరగ సాధ్వి! యిల్లురుం
గక మదీ తప్పి తేని త్రిజగమ్ములు నిన్ను హసింప కుందునే?"

తార- చీటికిమాటికి భర్తయని, పాతివ్రత్యమనీ ఉపన్యసించు చున్నావు. ఈలాటి ఉపన్యాసాలు ప్రపంచములో అనాదినుంచి వినబడుతూనే ఉన్నవి. కాని చంద్రా!

చ. "మగని నతిక్రమించుటలు మానినికిన్ తగదంటి వొప్పితిన్;
దమఁడు మగండటన్న మది మక్కువ యెవ్వనియందో, కంటికిం
పగు నతఁడెవ్వఁడో యతఁడె! ఆతనిఁ గాదని యన్యుగూడినన్
తగ దిది కాముకీ పునుల ధర్మము నీ వెరుంగవే?"

చంద్ర- తార ఇట్టి దారుణపాప కార్యమునకు ఇంత నిర్భీకముగా పాల్పడు చున్నావు. అక్కటా! లోకము నవ్వునని యైన సంకోచింపవా?

తార- లోకమా? నవ్వునా? హ హ హ! చంద్రా?

ఉ. లోకము నవ్వునంచు దనలో జనించిన ప్రేమ నాపగా
నేకనులాక్షి కైన దరమే? పరిఘూర్ణ తరంగమాలిక
నీకముతోడ గట్లొరసి నిండుగ బారు నఖండ వాహినీ
ఘోకల నాపబూనిన, తటంబులు ద్రెంచి జగంబు ముంపన్!

చంద్ర- తారాదేవీ! జారకృత్యమువంటి భయంకర పాతకము వేరొండు లేదుసుమా?

తార- చంద్రా జారత్వమనీ, సాధ్వీత్వమనీ శాస్త్రాలలో వ్రాసిపెట్టినదెవ్వరు? భగవంతుడా? కాదు. మనుష్యులే మీ మగవాండ్రే-

చంద్ర- నామీద కోపముకొలదీ వైన నీవు తలక్రిందుగ పలుకబడుచున్నది. కాని, తారాదేవి!-

క. "కోపము వలదిక- నీవీ
పాపమునకుం జొచ్చినన్ బ్రపంచమునం, దిం
కేపాలతి మగని యొద్దన్
గాపుర మొనరింపజాలు కాంతా! వినుమా!"

తార- చంద్రా! ఈ నీతిప్రసంగాలు చాలించి నామనోరథాన్ని ఇకనయినా పాలించు

చంద్ర- మానినీ! పాపపుణ్యములకు విపరీతార్థములుచెప్పి నన్ను ఎట్లో ఒడంబరచుటకు యత్నించుచున్నావు. అక్కటా

చదివితి వెల్ల శాస్త్రములు సాధ్వివటంచు జగంబునందు నిం
తవనుక పేరుగొంటివి-వినాశబుద్ధి యిదేల కల్గెనో
ముదితరో నీకునేడు? మన పూర్వచరిత్రల నెందు నైననున్
సుతతులు పుత్రులన్ గవయ జూచుట వింటిమె! కంటిమెకటా!

తార- చంద్రా పూర్వచరిత్రలు నే నెరుంగనివి కావు. కాని, తీరను కదిపితే డొంకంతా కదులుతుంది చెప్పనా-?

సీ. "కన్నకూతురటంచు నెన్నక భారతీ
తరుణికూడడె నీ పితామహుండు!
మేనత్తయను మేరమీరి రాధికతోడ
నెనయడే యచట నీ యనుగుబావ!

వదినయందు నొకింత వావిలేకయె జ్యేష్ఠ
నెలతతో బొందడే నీ గురుండు!
మునిపత్నియగు నహల్యను బట్టడే నీదు
సహపాఠియగు పాకశాసనుండు!
ఇట్టి మీవారినడతలు కట్టిపెట్టి
యమ్మ చెల్ల! న్యాయోక్తుల నాడెదేల".
రార ! నాతోడ సింగిణీ రమ్యమేఘ
యవనికల డాలి దోబూచు లాడుకోర !—

(అని చెయ్యి పట్టుకోబోతుంటే చంద్రుడు తప్పించుకుంటాడు)

చంద్ర- (వణికిపోతగా) అమ్మా ! అమ్మా !

తార- (నవ్వుతూ గట్టిగా నోరు మూస్తుంది.)

చంద్ర- ఈకృత్యము నాకు అసాధ్యము

తార- (పకపకనవ్వుతూ) చంద్రా ! జగన్మోహనా ! అక్షరాభ్యాస మైతేనే గాని ఏవిద్యా ఎవరికీ సాధ్యంకాదు. రా ! ఇటురా ! భయపడకు ! నీవు శిష్యుడవు! నేను ఉపాధ్యాయురాలిని ! కసురుకోనులే ! ఇదిగో ? చెప్పి నట్టుచెయ్యి ? చేస్తావా ? చేస్తావా

ఉ. తేయిటు నీదుచేయి ! ఇక తిన్నగ గన్నులు మూసికో ! ఉపా
ధ్యాయిని నేను మేనునకు నానిచి నీ శ్రవణమ్ములందు 'కో
కో!' యని పాడ నీమెయి గగుర్పు జనించెన? లేద? కల్గెనా
హాయి ? ఇకేలజాగు! పదరా ! ప్రమదాజన రాజమోహనా!

(అంటూ చంద్రుణ్ని లాక్కుపోతూ తార నిష్క్రమణం)

—

## దృశ్యం – అయిదు

శుక్రమహర్షి ఆశ్రమం వెలుపల
వారదుటు పరుగెత్తుకుంటూ ప్రవేశం.

శిష్య- ఆచార్యా !... దానవగురూ తమా !...శుక్రమహర్షీ !...మాట్లా... మాట!...
ఇటు ! ఇటు !

శుక్రుడు ప్రవేశం

శుక్రు- ఓహో! నారదుడా! మహర్షి! అభివందనములు.

నార- దానవర్షీ! ధన్యవాదములు!

శుక్రు- ఎక్కడనుండి నీ రాక? విశేషములేమి, బ్రహ్మలోకమ్మున నెల్లరకు క్షేమమా? నారదా!

ఉ. కల్లనిజమ్ము రెండు కలగాపులగమ్ముగ గల్పి, పోరు సం
ధిల్లగ జేతుపంచు జగతిన్ జనుపేరొక టబ్బియుంటచే
జెల్లని డబ్బుగా, యెప్పుడు చేతులు మారుచుండు నీవు, నా
వల్లన నేమి కావలసి వచ్చితో నేడు, వచింపు నారదా!

నార- శుక్రాచార్యా! రాక్షస గురుడవైన నీవు బ్రహ్మర్షినైన నాకు ఈమాత్రపు నర్మోక్తులాడకుండా స్వాగతమిచ్చెదవని నేననుకొనలేదు. నేను కలహకారి నని లోకము వాకొనుచున్నమాట నిజమే కాని, ఆచార్యా!

గీ. కలహ కారణములు కొన్ని కలిగియుండ,
వాని నొకచోట సంధించు వంతు నాది;
లేనికలహంబు సృష్టించు లేకిబుద్ధి
లేశమైనను నాయందు లేదు సుమ్ము!-

శుక్ర- నారదా? నీవు వచ్చిన కార్యమును దెల్పవైతివి?

నార- నేను తగవులమారినని తొలుతనే చెప్పితినిగదా, ఇక నేను తెలిసిన నేమి ప్రయోజనము? శుక్రాచార్యా! కలలోనైన నీవనుకొనిన యొకానొక మహోత్తరావకాశము లభించినది. అవిషయము నెరింగింపవలెనని గంపెడాశతో వచ్చితిని, గాని పుట్టెడు వగపుతో బోవుచుంటిని. ఆచార్యా! సెలవు!

శుక్ర- ఏమది? నారదా! ఆగు! ... నాకు అవకాశమా? .. నేను కలలోనైన అనుకొననిదా? ... ఎట్టిదా యవకాశము? దేనికి సంబంధించినది? అది అంతటి మహోత్తరమైనదా? నారదా! నీమాటలు నిక్కముగా నన్నూరించుచున్నవి.

నార- ఆచార్యా! అది మహోత్తరావకాశ మనుట నిస్సంశయము. అట్టిది నీకు మరల లభింప నోపదనుటనుటగూడ నిశ్చయము.

శుక్ర- అది యెట్టిదో వినుటకు మిక్కుల యుత్సహించుచున్నాను.

నార- అవకాశమెట్టిదనగా-ఆచార్యా? కలడుగదా ఆనాడు కచునిబంపి నిన్ను వంచించి నీ మృతసంజీవనిని పస్కరించిన యాదేవగురువు బృహస్పతి?

శుక్ర- ఔను.

నార- అతడొనరించిన యాదురాగతమునకు దగిన ప్రతిక్రియ నొనర్చు నవకాశము నేటికికిన్ నీకు లభించినది.

శుక్ర- నిజముగాన!...అట్టి యవకాశమున్నదా!... ఎట్టి శుభవార్త నాలింప జేసితివి? నారదా వివరించి చెప్పుము.

నార- కలదుగదా సుందరీ గగనతార, రతీ పరావతార, తార యను పేరుగల భార్య యొకర్తు బృహస్పతికి ?

శుక్ర- ఔను- ఈతపాదంలో గురిగింజ తీగవలె అవ్వృద్ధునివద్ద ఆమె యున్నదనుట జగద్విదితము.

నార- ఇక మరింత జగద్విదితము కానున్న విషయ మేమనగా, తారా బృహస్పతి వియోగము - తారా చంద్ర సంయోగము !

శుక్ర- తారాచంద్ర సంయోగమా ! ఎవడాచంద్రుడు ?...అత్రి పుత్రుకుడును బృహస్పతి ప్రియశిష్యుడును అగు చంద్రుడేనా!

నార- ఔను.

శుక్ర- ఏమేమీ! గురువునొద్దనే గాక గురుపత్నియొద్ద కూడ కళ లభ్యసించు నంతటి ప్రౌఢ యయ్యెనా?

నార- ఆచార్యా ! ఇన్నిమాటలేల ? నీదివ్యదృష్టిని ప్రసరించి, ఆ బృహస్పత్యాశ్రమములో, ఆ పర్ణకుటీరములో ఆ శయ్యాగృహములో. ఆ తారాచంద్ర ఘట్టమున నొక్కసారి తిలకించిన సర్వము నీకే తెలియగలదు.

శుక్ర- నారదా! బహుళ తపస్సిద్ధిచే ప్రాప్తించిన పవిత్ర దివ్యదృష్టిని ఇట్టి అపవిత్ర దృశ్య సందర్శనమునకై వినియోగించుట అలిమ కార్యము కాని నారదా

ఉ. తల్లియటన్న వావి, గురుతల్పగ పాతకమన్న భీతి, యే
మొల్లక యెట్టులీవనికి నొప్పెదమయ్యెనో చంద్రు! వోర! యి
ల్లొలక గట్టుకొన్న పతినొల్లక, శీలము కీర్తి పంగడం
బొల్లక యెట్టు లీపనికి నొప్పె నభాగిని! తార! యక్కటా!

కానిమ్ము! తారయేమైన నాకేమి? నీవన్నట్లు నాశత్రువుపై బగసాధించుటకు నిక్కముగా నవకాశము లభించినది. నారదా! ఇకమూడు మీ శుక్రునివిక్రాంతి ఆ బృహస్పతి యధోగతి!

నార- ఆచార్యా! ఏమిచేయదలచితివి?

శుక్ర- తొందరయేల? నీవే పరికించెదవుగాక! సత్వరమే బృహస్పత్యాశ్రమమునకేగి కార్యకలాపము ప్రారంభింపవలసి యున్నది. నారదా! ఇచ్ఛయున్నచో నీవు కూడా నాతో రావచ్చును.

నార- కానిమ్ము. మీయిరువురు కలహ వినోదమును జూచుటకన్న ప్రస్తుతము నాకితరోద్యోగము కన్పించుటలేదు. మంచిది. ఆచార్యా! నీవు లోనికేగి ప్రయాణసిద్ధుడవు గమ్ము నేనును కాల్యకరణీయము లాచరించుకొని వచ్చెదను.

శుక్ర- అట్లే యగుగాక. (నిష్క్రమణం)

నార- ఆనందము! బ్రహ్మానందము! లక్ష్మీకళత్రా! భక్తజన వశంకరా! ఈచల్లనివేళ నిన్ను మనసార స్మరింతునుగాక!-

నారదుని గానం

(నిష్క్రమణం)

---

# అంకం నాలుగు

## దృశ్యం ఒకటి

బృహస్పతి ఆశ్రమంలోని శయ్యాగృహం వెలుపల పరిగెత్తుకుంటూ శాంతా, లంబూ, జంబూ ప్రవేశం.

లంబూ- అమ్మా!......అమ్మా!...(చప్పట్లు)

జంబూ- భగవతీ!...భగవతీ! (చప్పట్లు)

శాంత- తారాదేవీ!... తారాదేవీ! (చప్పట్లు)

లంబూ- తలుపు! తలుపు!

జంబూ- తియ్యండి! తియ్యండి!

శాంత- తొందరగా తియ్యండి! తారాదేవీ!...సంగతేమిటంటే, ఇంద్రలోకంనుంచీ మీభర్తగారు తిరిగివస్తున్నారు. చంద్రుణ్ణి వెంటనే బయటకు పంపివేయండి లేకపోతే ప్రమాదం వినబడిందా నామాట?

లంబూ- అవ్వే. మూడురోజులనుంచి యిదేవరుస.

జంబూ- ఏంచేద్దాం? శాంతా! అదిగో విమానం వచ్చేస్తుంది. వీళ్ళు మనకు కనబడడంలేదు. మనం వాళ్ళకు వినబడడంలేదు. వ్యవహారం చూస్తే విప్లవించేటట్టే వుంది.

లంబూ- మనకెందుకురా ఈ ప్రయాస? జరిగే శృంగభంగమేమిటో జరగనియ్

జంబూ- నిజమే. స్నేహితులం మన మున్నాముగదా. మంచీ చెడ్డా మనతో చెప్పి చెయ్యకూడదు? ఈ చంద్రుడికి ఇంత ధైర్యమా? ఇంత కావరమా? కానీ — వాడు తవ్వుకున్న గోతిలోనే పడ్డాడు.

లంబూ- పడ్డాడురా గోతిలోనే పడ్డాడు.

శాంత- లంబూ? జంబూ!

లంబూ- మధ్య నీ హడావుడేమిటి?

జంబూ- తారకు చంద్రగ్రహణము అయిందని నీకు ఈర్ష్యగా వుందా?

లంబూ- నీపాలటికి రాహుకేతువుల్లాగా మేమున్నాములే.

శాంత- మిత్రులారా! మనం ఏలాగయినా తారా చంద్రుల్ని రక్షించాలి.

జంబూ- మనకేమి అవుసరము? వాళ్ళిద్దరూ మూడు పగళ్ళూ, మూడు రాత్రిళ్ళూ కన్నూ మిన్నూ కనబడకుండా ప్రవర్తిస్తుంటే, కావలసిన ప్రాయశ్చిత్తం కానివ్వవలసిందే గాన మనం అడ్డుపడడమెందుకు?

శాంత- అయ్యో! అయ్యో! అదిగో! విమానం దిగనే దిగింది.

జంబూ- కొంప గుభిల్లున కూలిందన్నమాటే

లంబూ- అదిగో గురువులవారు విమానం నుంచి దిగారు.

శాంత- మంచిది. ఇక ఒక్కటే వుపాయం. గోడదూకయినాసరే, వాళ్ళకయ్యా గృహంలోకి వెళ్ళి హెచ్చరిక చేస్తాను. (నిష్క్రమణం)

(బృహస్పతి ప్రవేశము)

లంబూ- } వందే భగవన్! (నమస్కారాలు)
జంబూ- }

బృహ- సుఖీ భవ! శిష్యులారా! ఆశ్రమంలో నెల్లరును కుశలమా?

లంబూ- } చిత్తం చిత్తం.
జంబూ- }

బృహ- ఆనందము!

లంబూ- అయితే, గురుదేవా! ఇంద్రలోకంలో యజ్ఞం జయప్రదంగా జరిగిందా?

బృహ- శిష్యులారా! యజ్ఞమఖండ జయప్రదంగా నెరవేరినది.

శా. నాకాధీశుడకుండ మోద భరితుండౌనట్లు యజ్ఞంబు సు
శ్రీ కళ్యాణముగా వహించితి, శచీ సీమంతినీరత్న మె
న్నో కానుకల్ దయచేసె తారకయు, యెన్నో రత్నముకావళుల్
గాకున్ దక్షిణలిచ్చె నింద్రుడు, మహానందంబుతో వచ్చితిన్.-

జంబూ- గురుదేవా! మేముకూడా మహానందంతో మీరాక కోసమే ఎదురు చూస్తున్నాము.

బృహ- తార క్షేమముగా నున్నదా?

లంబూ- ఆc. చంద్రుడుకూడా కులాసాగా వున్నాడు గురుదేవా?

బృహ- నేనులేనికాలమంత యెట్టిదియులేకుండ మీ అధ్యయనము యథావిధిగా కరుగు చున్నదా!

లంబూ- ఒక్క అధ్యయనమే యేమిటి? గురుదేవా! మీరులేని లోపం లవలేశమైనా కనబడనీయకుండా మన చంద్రుడు అన్ని వ్యవహారాలు మీకుమల్లేనే చేసేస్తున్నాడు.

బృహ- మరచితిని. శిష్యులారా! నా విమానధ్వని తారా కాంతా చంద్రులకు వినిపించి యుండెనుగదా? వారలేల నాకెదురు రారయిరి? ఎక్కడకున్నారు ఏమి చేయుచున్నారు? .........రండు! వారిని కలుసుకొనుటకయి హృదయము మారాటపడుచున్నది. రండు!

లంబూ- (బిగ్గరగా) అమ్మా! అమ్మా! గురువుగారు వచ్చారు మువ్వంకాయకూర సంగతి తర్వాత ఆలోచిద్దురుగాని ముందు కాళ్ళు కడుక్కోటానికి నీళ్ళు తీసుకురాండి.

జంబూ- (బిగ్గరగా) చంద్రా! చంద్రా! గురువుగారు వచ్చారు. ఇక వారి పనులు వారు చూచుకుంటారు గాని నీవు కష్టపడకులే నాయనా!

బృహ- ఔరా! వీరిసంభాషణ నేడు అదోక వింతరీతిని హృదయస్పందన మొనరించు చున్నది. వీరిరువురు మూఢ ప్రవృత్తి కలిగిన బాలురు. అయినను-

గీ. ఆటలాడెడు పిల్లవాండ్రట్టి యొక్క
బెడ్డ వైచినవెంటనే వికల మగుచు
చిట్టి తరగల గంపించు చెరువువోలె
హృదయము కలంగ బారెడు. హేతువేమి!

(ముగ్గురూ నిష్క్రమణం)

---

## దృశ్యం–రెండు

శయ్యాగృహంలో తారాచంద్రులు ప్రేమ గానంతో ప్రవేశం.

ఇద్దరూ సంపూర్ణశృంగార వేషంతో ఉన్నారు. పాటపాడుతూ తార చంద్రుడికి గంధంపూస్తుంది. తమలపాకులందిస్తుంది. పూలచెండులువేస్తుంది. ఫలహారాలు అందిస్తుంది. చంద్రుడుకూడా నిర్భయంగాను విలాసంగాను ఆమెతో విహరిస్తున్నాడు.

డైలాగ్ పాట (11)

పాటచివర బయటనుంచి పెద్దచప్పుడు వినిపిస్తుంది. తారాచంద్రులు ఉలికిపాటుతో పాటఆపేసి చప్పుడు వినవచ్చినవైపు కేసి చూస్తుంటారు

తార– ఎక్కడిదా చప్పుడు ?

చంద్ర– ఎవరో గోడదూకినట్లున్నారు!

"తారా ! చంద్రా ! ప్రమాదం !" "ప్రమాదం" అంటూ శాంత భిభత్స వైఖరితో ప్రవేశం

తార– ఏమది ?

చంద్ర– ప్రమాద మెట్టిది ?

శాంత– బృహస్పతి భగవాన్లు

చంద్ర– వచ్చారా ?

శాంత– ఇంద్రలోకంనుంచి ఇప్పుడే విమానం దిగారు. సరాసరి ఇక్కడికే వస్తున్నారు

చంద్ర– హతోస్మి ! హతోస్మి !—

తార– విమానధ్వని నాకు వినబడలేదే !

చంద్ర– నాకును వినబడలేదు.

శాంత– ఎలావినబడుతుంది. ఈ ప్రపంచములో వుంటేగా మీరు !

తెరలో బృహస్పతి "తారా ! తారా !"

చంద్ర– అదుగో గురువులవారి కంఠస్వరం ।...... శాంతా ! ఏమి యుపాయము

తెరలో బృహస్పతి "తారా । తారా ।"

శాంత– అదుగో। తుపానులాగే వచ్చిపడుతున్నారు. । ఏమి ఉపాయము ? అయ్యయ్యో మీరు చూస్తే శృంగార వేషాలతో వున్నారు. గది చూద్దామా మన్మథ క్రీడా

క్రీడారంగంగా కష్టమవుతున్నది. ఎంతప్రమాదం వచ్చింది !

తెరలో బృహస్పతి "తారా ! తారా !"

చంద్ర- తారా! ఎంతచెప్పినను వినక నన్నీ దురంత దారుణ కూపములోనికి నీవే దింపితివి. ఇ- ఇట్టియుగుణని తొలుతనుండియు నేననుమానించు చుంటిని. మానినీ పతిద్రోహపాతకమునకు నీవు, గురుద్రోహ పాతకమునకు నేను, ఈలోకమునందే ఇప్పుడే శిక్షానుభవము కలుగనున్నది. అయ్యయ్యో ! స్త్రీబుద్ధి ప్రళయాంతకమని యెరింగియు ఈవలయందు జిక్కుకొంటినిగదా!

శాంత- చంద్రా! ఆపత్సమయంలో అబలను నిష్ఠూరమాడే పురుషుని కంటె అధమాధముడు లేడుసుమా ?

తెరలో బృహస్పతి ! "తారా !"

తార- కానిమ్మ శాంతా ! ఒకతప్పు చెయ్యనే చేశాను. దానిని కప్పిపుచ్చి మరో తప్పు ఎందుకు చెయ్యాలి ? రానిమ్మ - వారిని రానిమ్ము! ఎట్టి దారుణశిక్ష విధించినా సరే, నిజమే చెబుతా —

చంద్ర- అయ్యయ్యో ! తారా ! నీవు నిజము చెప్పినయెడల నాగతి యేమగునో ఊహించితివా ?

తెరలో బృహస్పతి "తారా ! తారా !"

శాంత- అమ్మా! ... నాకు ఒక ఉపాయము స్ఫురించింది ... చంద్రా! నీవు పురుషుడవు. కాబట్టి నీజీవితానికి ఏహానియూ కలుగదు అమ్మా ! నీవు సంసార స్త్రీవి నీపేరుప్రతిష్టలు కాపాడుకొని నీసంసారాన్ని నిలువబెట్టుకోవడమే ముఖ్యకర్తవ్యం చంద్రా ! నీవు ఇక్కడనేవుండు. అమ్మా ! మీరు ఈ స్నానాలగదిలోనికి వెంటనే పోయి లోపల గొళ్ళెంవేసుకొని ఈ శృంగార వేషం తీసివేసి యథాప్రకారంగా నారచీర కట్టుకోండి ఇంతలో గురువుల వారిని అమాటా ఈమాటా చెబుతూ ఇక్కడనే ఆపేస్తా ! ఇదే ఇప్పటి కుపాయం ! రండి ! రండి ! (అంటూ తారను బలవంతంగా స్నానాల గది లోనికి నెట్టివేస్తుంది.)

తెరలో బృహస్పతి "తారా ! తారా !"

శాంత- ఎవరు మీరు ? పేరేమిటి ? ఎందుకు వచ్చారు ?

తెరలో బృహస్పతి "నేను బృహస్పతిని ! తలుపుతియ్!"

శాంత- మీరా ? వస్తున్నా భగవన్ ! వస్తున్నా !

చంద్ర- శాంతా ! నీకు నమస్కారము నన్నుకూడా ఎక్కడైనా దాచివెయ్ !

శాంత- ఇలాంటి పిరికిపందలు ప్రేమించే ఆడదాన్ని ముక్కు చెవులు కోయాలి (అంటూ నిష్క్రమణం)

మళ్ళీ వెంటనే బృహస్పతియు శాంతయు ప్రవేశం

బృహ- ఓహో! నా ప్రియశిష్యుడా!... చంద్రా!... సౌఖ్యమా?

చంద్ర- చిత్తము భగవాన్!

బృహ- చంద్రా! నీవేషము చూడ పెండ్లికొడుకువలె కల్పించుచున్నావు. కాని నీ ముఖ వైఖరి చూడ కడుంగడు వెలవెలబారి యున్నది విషయ మేమి?... ఉండు... ఈ కుటీరమునందు ఏన్నడును లేని సుగంధపరిమళములు! ఈ దీప కరండములు! ఈ తాంబూలములు! పూలదండలు! ఫలహారములు!... ఏమది!.. ఇది తొల్లింటి నా యాశ్రమకుటీరమా?.. లేక బుద్ధిమాంద్యమున నేదేని వేశ్యవాటిక యందు అడుగిడితినా?.. చంద్రా తారా! యెక్కడ

శాంత- తారాదేవి స్నానాల గదిలో వున్నారు భగవాన్ మీరు వచ్చారనే ఆనందముతో స్నానం తొందర తొందరగా ముగించుకొని వస్తున్నారు

బృహ- అటులనా?.. కాని! నా నిరుపేద కుటీరము నేడింటి యపూర్వ శృంగార భంగిమలతో విలసిల్లు చుండుటకు హేతువేమో చెప్పెదవా?

శాంత- (కికిలి నవ్వుతూ) ఇంతమాత్రం గ్రహించుకోలేరా భగవాన్?

బృహ- వృద్ధులకు బుద్ధిమాంద్యము సహజమని నీ వెరుంగవా శాంతా!... ఆ మర్మ మ్మెట్టిదో నీవే విప్పి చెప్ప దగుదువు.

శాంత- మర్మం ఏముంది భగవాన్? ఈ గదిని. అమ్మగారు... ఇవ్వాళే... ఇలా... ఎందుకు అలంకరించారంటే ...మీ కోసమే!..

బృహ- నాకొరకా?... ఈ దినమున నేను వచ్చెదనని ఆమె దివ్యదృష్టితో తెలియం గలిగెనా?

శాంత- కాదు నిన్న రాత్రి ఆమెకు స్వప్నంలో కనబడి చెప్పారట!

బృహ- ఏమని?

శాంత- ఇవ్వాళే తప్పకుండా వస్తానని, అంచేత ఏంతో ఉత్సాహంతో ఈ అలంకారాలు చేసి స్వాతివర్షంకోసం ముత్తెపుచిప్పలాగా మీకోసం ఎదురుచూస్తున్నారు. భగవాన్! భర్త రాకకంటే పతివ్రతామ తల్లులకు మహోత్సవ సమయం ఏముంటుంది?

బృహ- వాచాలినీ! ఇక నీ గడుసుదనపు మాటలు చాలించి నిజము చెప్పుము

తారతోపాటు ఈచంద్రుడుకూడా సింగారించుకొని యుండుటకు హేతు వేమి ? ఈరెంటికిని పరస్పర సంబంధములేదా ? నిజముచెప్పుము.

శాంత- (మౌనం)

బృహ- నోరుకట్టుపడెనా ? మంచిది. ఈపెండ్లికొడుకే ఈవిధావిధాన వేషం గించుగాక చంద్రా ! నీవైన నిజముచెప్పెదవా ?

చంద్ర- నాకేమి తెలియదు.

బృహ- నీ మొదలినిగల దుస్తులు బ్రహ్మచారికి యోగ్యములో, పెండ్లికొడుకునకు యోగ్యములో అదికూడా తెలియని అపస్మారక చిత్తావస్థయందుంటివా ?

చంద్ర- నాకేమియు తెలియదు

బృహ- ఓరి కపటీ ! సత్యమే నిజము చెప్పుము లేకున్న ఈబ్రహ్మదివహాసము తప్పక కడ మాట్టగలను ! ఊం చెప్పెదవా ? లేదా ? లేనియెడల—

(తార గర్భాలున ప్రవేశము. వేషంమార్చుకోకుండా వెనకటి శృంగార వేషం తోనే వచ్చింది.)

తార- (ప్రవేశిస్తూనే)...ఆగండి !

బృహ- తారయా ? !...తారా ! నీవుకూడ సంపూర్ణ శృంగార వేషధారిణివై దర్శన మిచ్చితివి ! స్నానములగదినుండి ఇట్టి శృంగారనాయకీ వేషధారణము వెలు వడుట. వింతలకువింత !...తారా ! నీవైన నిజము చెప్పెదవా ?

తార- (తలవంచుకుంటుంది)

బృహ- తారా ! దేవర్షి కాంతవు. అసత్య మాడుట కంటె అధమాధమ దోషములేదు సుమా నిజము చెప్పుము. చెప్పెదవా ?

తార- చెప్పెదను. .

బృహ- చెప్పుము.

తార- చెప్పెదను. నిజమే చెప్పెదను. మహర్షీ ! ... నేను మీయెడల దారుణమైన అపరాధం చేశాను...

బృహ- నాయెడలనా ? !..... ఎట్టిదా యపరాధము ?

తార- మీరు సహింపజాలని ఒక భయంకర అపరాధం !

బృహ- ఎట్టిదది ?

శాంత- నేను చెప్తా అసలునిజం. భగవన్ ! అమ్మగారు ఏ అపరాధమూ చెయ్యలేదు. అపరాధం చేసింది నేను ! అంటే ఈగదిలో నేనూ ఈచంద్రుడూ.

తార- ఆగు ! శాంతా ? నన్ను రక్షించడానికై నాతప్పు నీ నెత్తిపై పెట్టుకుంటున్నావు

నీ సఖిత్వానికి సహస్ర ధన్యవాదాలు ! కాని మహర్షీ ! తప్పుచేసింది తార కాదు — నేను !

బృహ- శివశివ ! .....తారా ! ఇది నిక్కమా ? పరిహాసమా !

తార- పరిహాసంకాదు. నేను చంద్రునితో కలసి మీశయ్యను కలుషితంచేశాను. చెక్కుకుండా ఉండాలని విశ్వప్రయత్నం చేశాను. కాని, విధి బలవత్తరమైంది. నాచేత ఆపని చేయించింది. ఇందులో చంద్రునివల్ల రవ్వంతైన తప్పులేదు. తప్పంతా నాది ! .. కాని, తరచిచూస్తే ఈ తప్పు కొంతమీది కూడాను.

బృహ- ఏమంటివి ? తప్పు నాదియూ ? కులటా ! ..

తార- ఔను ! మహర్షీ ! కోపం విడిచిపెట్టి ఒక్కింత ప్రశాంతంగా యోచించండి !

ఆ. వె. ఆలుమగలయందు నన్యోన్య మున్నచో
దప్పు లేల గలుగు ధరణి యందు ?
భర్త చెడిన యెడల భార్యదే లోపమ్ము !
భార్య చెడిన యెడల భర్త తప్పు !

బృహ- కండకావరమున కానిపని యొనరించియు లజ్జాలేశమైన లేక తప్పంతయు నామీదికి త్రోయుచుంటివా ? చంద్రా ! నాతార ఈ అగాధ నారకకూపమున బడుటకెల్ల నీవే మూలకారణము ఓరీ !

చ. గొనకొని కూర్మిసోదరుని కోర్కె బతె నిన్ను బవారు వర్షముల్
పెంచితి, పెద్దజేసితిని, విద్యలు నేర్పితి–గాని యక్కటా !
ఘన విషదంష్ట్రికా భయద కాలభుజంగిని పాల బెంచుటే
యని దలపోయ లేదు. కలనైనగటా ! అది యెట్టి మూర్ఖ్యమో !

తార- మీయసమర్థ కోపమును చంద్రుడిమీద ఎంతమాత్రం చూపవద్దు. మహర్షీ ! నేను కాపరానికి వచ్చి యిరువైయేండ్లు గడచిపోయినవి. ఇంతటి దీర్ఘకాలం నా జీవితం ఎలా గడచిపోయిందో, మీరు నాతో ఏవిధంగా వర్తించారో కొంచమైనా యోచించారా ?

సీ. తీర్థయాత్రలటంచు తిరుగుట కొన్నాళ్ళు
జన్నంబు లంచును కొన్ని నాళ్ళు
గురుకులవాసపు గోష్ఠితో గొన్ని నాళ్ళు
పున్నమమాసంచు గొన్ని నాళ్ళు

వ్రతములు పూజలు క్రతువులు కొన్నాళ్ళు
ఘోరతపస్సుల గొన్ని నాళ్ళు
జపములు కొన్నాళ్ళు శ్రాద్ధముల్ కొన్నాళ్ళు
క్రూరనిష్టలతోడ గొన్ని నాళ్ళు
గాగ, నా ప్రాయమెల్ల నీకరణి నేగె
ఎన్నడును నీదు కౌగిలి యెరుగనైతి !"
నీరు లేనట్టిలతిక, యేతీరు బ్రతుక
జాలునో యూహ సేయుమా సంయమీంద్రా !

బృహ- ఓసీ ! పరమపవిత్రమైన దేవర్షి కులమున జనించుటచే మాకు జపతపోనిష్టా నియమమ్ములే ప్రధానములు కాని, పామరులవలె నిరంతర వ్యసనపారీణత యోగ్యమగునా ? వాచాలినీ !......

ఉ. నీమము లేక, యధ్యయననిష్టలు లేక, పశుప్రవృత్తితో
తామసులై మెలంగుచు, సదా వ్యసనాంబుధి మున్గితేలు నా
కాముక కాముకీజనుల కైవడి, నన్నును తెల్లవేళ బెం
డ్లాముల గౌగలించుకొని లాలసతన్ జరియించు టొప్పునే ?

తార- మహర్షి ! మీకు విలాలసత్వమూ లేకపోతే వయస్సంతా చెల్లిపోయి ఆఖరి దశల్ల వృద్ధాప్యంలో జీవితసంధ్యాసమయంలో పదహారేళ్ళయువతిని ఎందుకు గొంతు కోశారు! లోకాచారం కాబట్టి వివాహం మాడారా! భార్య అంటే ఒక ప్రతిమ అనుకున్నారా ? మీకు మీ జపాలమీద వున్న రక్తిలో ఆసక్తిలో వెయ్యోవంతైనా మీ భార్యమీద ఎన్నడైనా కనబరిచారా ? ఈ భార్యకు, జీవనానందం అవసరంలేదా ? దీనికి హృదయం లేదా ? మహర్షి ! మీరు కూర్చోడానికి ఒక పీటలాగా, మీరు పళ్లు తోముకోడానికి ఒక దంతకాష్టంలాగా, మీరు తొడగడానికి ఒక పాదరక్షలాగా, మీపూజలకు వ్రతాలకు నిష్టలకు, నియమాలకు కావలసిన సామాగ్రులన్నీ సక్రమంగా సకాలానికి అందించే ఒక నిర్జీవయంత్రంలాగా నన్ను ఇన్నేళ్ళూ చూశారు. అప్పటికీ, నేను ఆదర్శకాంతను కాబట్టి, నాజాతి రక్తంలో సహనం త్యాగం నిగ్రహం జీర్ణించియున్నవి కాబట్టి ఇంత దీర్ఘకాలం సహించుకున్నాను. కాని సహనం కడముట్టి ఒక చెడుముహూర్తంలో అపరాధం చేశాను. స్వర్గమో నరకమో, సంఘవిరుద్ధమో సంఘసహజమో, నావయస్సునకు సహజమైన ఆనందానుభవాన్ని ఈచంద్రునివల్ల పొందాను. చాలు ! ఇక ఈ జీవితంమీద నాకు వాంఛలేదు. పండీ ! మీ యిచ్ఛవచ్చినట్లు ఇక దండించండి కత్తెరబోనులోపెట్టి కండతుండెములుగా

కోయించండి ? కాలుసేతులుకట్టి కాకిగ్రుక్క శునక శృగాలములకు వేయించండి ? లేక ప్రళయకీలకీలికా సదృశములైన మీ శాపాగ్నిచ్ఛటలచే భస్మం చేయండి ।

బృహ- హా ! ఈ ఖర్వదేంద్రమువలనయు నీవు పొందిన చిత్తావేదన ఇపుడిప్పుడు నాకు అర్థమగుచున్నది. కాని, ఒకింత సేపు నీ వోర్పుంచుము । ముందు ఈ పాతకి వ్యవహారము పరిష్కరింపవలసిన యున్నది. ఓరీ చండా ! కపట నటన బ్రహ్మచారీ ! తారపై నున్న వ్యసనమహాకూపమున బడుటకు హేతువొకటి యుండిన నుండవచ్చుగాక ! విద్యార్థివై బ్రహ్మచర్యనిష్ఠ యందుండి నీవొనర్చిన యీ జుగుప్సాకర దారుణ గురుద్రోహమునకు హేతువేమిరా ? ఓరీ గోముఖ వ్యాఘ్రమా ?

శా. ఔరా ! యెంతటి ద్రోహ బుద్ధివిర చంద్రా ! మర్త్యతీ ! పాతకీ !
లేరే లోకమునందు పూర్వను లుగ్! నీ లీలన్ మదోన్మత్తులై
దౌరాత్మ్యంబున గురుకాంతఁ బొందినారే ! దురా
చారుఁ నిన్నిక బూదిసేతు చటులాస్యద్ఘోర శాపాగ్నికిన్.

అంటూ మంత్రోదకాలు చంద్రుడిమీద చల్లబోతాడు
"ఆఁ ఆఁ ఆగండి । ఆగండి!" అని తార అడ్డుపడుతుంది.
అదేసమయములో పరుగెత్తుకుంటూ జంబూ లంబూ ప్రవేశిస్తారు.

లంబూ- భగవన్ ! భగవన్ ! రాక్షస గురువర్యుడును మీకు ఆజన్మవిరోధియు నగు శుక్రమహర్షులవారు వస్తున్నారు.

జంబూ- ఆయనతోపాటు ఆ జగడాలమారి నారదుడుకూడా వస్తున్నాడు

బృహ- ఓసీ ! ఇది నాకుటుంబకలహము. దీనితో ఏశుక్రునకుగాని ఏనారదునకుగాని ఏ యితర అధమాధమునకు గాని ఎట్టి ప్రసక్తియును లేదు. తెలిసెనా ! శాంతా ! లంబోదరా ! జంబుకేశ్వరా ! మీకును అంతే ! మీముగ్గురు కూడా నా సన్నిధినుండి ఇప్పుడే ఈక్షణమే తొలగిపోండు లేదేని కోప ఘూర్ణితుడైయున్న ఈ దేవర్షి వాక్కులై నిపుడు వెలువడు నొక్కొక్క పలుకు ఒక్కొక్క మహామారణాస్త్రమువలె మిమ్ము కబళింప గలదు. పొండు ! పొండు ! పోయి ఆ వచ్చెడి యేకాక్షితోనూ, ఆ యపశకున పక్షితోనూ తమతమ జీవితములపై ఆశ కలదేని ఈక్రోధానిష్టమునిసింహము సన్నిధికి రావలదని చెప్పుడు. పొండు ఊఁ.

శాంత
లంబూ } చిత్తం. చిత్తం.
జంబూ

(ముగ్గురూ నిష్క్రమణం)

బృహ- ఓరీ చంద్రా ! నీమహాపాతక జీవితకథకు స్వస్తి చెప్పుచున్న నాకు అంతరాయము కలిగినది కాని, నావాక్కునందుగు పవిత్రత నిల్చియుండునంత కాలము నీ వెక్కడికి పోగలవు ? ఓరీ గురుద్రోహీ ! నిలు ! నిలు ! (అంటూ మంత్రోదకములు పట్టుకుంటాడు.)

తార- — ఆగండి ! మహాత్మా ! చంద్రుణ్ణి శపించినంత మాత్రంచేత ఫలమేమి ? నేను మళ్ళీ మీకు స్వీకారయోగ్య నవుతానా ? అతణ్ణికాదు నన్ను శపించండి !

చంద్ర- కాదు ! భగవన్! తప్పంతయు నాది ! నన్నే శిక్షించండి ! నేను తమకుగొప్పను విద్యార్థినై వచ్చితిని కాని విద్యార్థి కనుచితమగు రీతిని వర్తించి విద్యార్థిప్రపంచమున కెల్ల శాశ్వతకళంకమును ఘటించితిని. గురూత్తమా!

ఉ. వ్యర్థపు మాటలాడుచు, నప్రతుల చెల్మిని సంచరించి, ప్రే
మార్గములందు మున్గి, పరమార్థపు విద్యల విస్మరించు వి
ద్యార్థులు వ్యర్థజీవనులు, దండ్యులు: సంయమినాథ ! ఇక వి
ద్యార్థిగణమ్ము లెల్ల కుదాహరణమ్ముగ నన్ను జంపి, లో
కార్థము బ్రహ్మచర్య మహిమాధికతన్ బ్రకటింపు మొజ్జరో !

(అంటూ బృహస్పతి ముందు మోకరిస్తాడు)

అప్పుడు "ఆగు చంద్రా ఆగు బృహస్పతీ !" అంటూ

శుక్ర నారదులు ప్రవేశము

నార- బృహస్పతీ ! అత్రిఅనసూయల గౌరవమైన దలంపక ఈ పసిబాలకుని నీకోపాగ్నికాహుతి గావింప నెంచితివా ? ఔరా ! ఎంత కఠినుడవు ?

శుక్ర- దేవగురూ ! భార్యయెడ మమకారము నింకను విడజాలక ఆమెను క్షమించి ఈ కుఱ్ఱవానిని మాత్రము శిక్షింప బూనుకుంటివా ? నీవిద్యకు దగిన ధర్మాధర్మ నిర్ణయ మిదియేనా ? ఓయీ చంద్రా ! ఈముదుసలి నిన్ను శపింప సాహసించునేని ప్రళయప్రచండమగు నా ప్రతిశాపముచే నీతని తప్పక నిగ్రహించెదను గాన నిర్భీతి నుండెదవు గాక.

తార- రాక్షసగురూ ! దేవగురువు నీభీభీషికలకు బెదరు నంతటి భీరుడు కాడు సుమా.

బృహ- ఓయీ ! ఆహ్వానింపకయే వచ్చిన అనవసరపు తీర్పులారా ! నా అనుజ్ఞలేనిదే ఈకుటీరమునందడుగిడిన మీసాహసము నిక సహింపజాలను. సత్వరమే వచ్చిన త్రోవను పొండు

శుక్ర- ఇది యింకను నీ కుటీరమని భ్రాంతి పడుచుంటివా ? గీష్పతీ ! ఇది యిపుడు పవిత్రమునాశ్రమము కాదు— జారిణి విలాస మందిరము—స్వైరిణీ నృత్తరంగము—విటవిటీ దుర్గంధ పంకపంకిల గుహాగహనము!

తార- శుక్రమహర్షీ ! అనవసరపు కంఠశోషయేల ? నీవు వచ్చినపనిని రెండుమాటలలో ముచ్చటగా ముగించి చెప్పుము.

శుక్ర- ఓయీ ! బృహస్పతీ ! కులటా ప్రాణపతీ !

ఉ. తార సుధాంసుతో గలసి తప్పొనరించిన ఘోరవార్త యీ
ధారుణి మారుమ్రోగె, ఋషితల్లజు లేడ్గురు గూడి నిన్ బహి
ష్కారము సేయ నిర్ణయముసల్పి సురేంద్రునిసన్నిధిన్ సభన్
దీరుప నున్నవా రికను నీపతనంబు ధ్రువంబు గీష్పతీ !—

తార- మహర్షీ ! మీకు యింతటి యపకీర్తిఘటించి మీ ప్రశాంత జీవనాన్ని ధ్వంసం చేసిన ఈమహాపాతకురాలిపై ఇక లవలేశమైనా జాలి తలవవద్దు. నేను ఈకథ యిక వినలేను. ఈదృశ్యం ఇకచూడలేను. నన్నుశపించి ఈపాపిష్ఠి తనువునుండి సత్వరమే విముక్తి ననుగ్రహించండి.

బృహ- నారీ! ఒక్కింత యోపిక పట్టినయెడల ఎల్లరకును విముక్తికాగలదు. మునుముందు ఈశ్మశానపు గ్రద్దలను బరామర్శించెదగాక. అటులైన శుక్రా ! నారదా ! నాకు కులబహిష్కారమా ?

తార- ఔను. వెలి ! వెలి !

శుక్ర- వెలి !

బృహ- యిందుకు సప్తర్షుల నిర్ణయమా ? ఇంద్రుని అధ్యక్షతయా ? దీని కొక సభయా ? నాయింటిగోడపలపై లోకమున కింతటి యాసక్తిగలిగెనా ? తార యొనర్చిన కృత్యమునకు మహర్షులు దేవతలు దేవులుఇంతగా తల్లడిల్లుచున్నారా? ఓయీ ఈవార్త నాకెరిగించుటకు మీకైనను ఏల సిగ్గు లేక పోయెను ? బుద్ధి సన్నగిల్లిన ఓ పెద్దలారా !

సీ. గౌతమపత్నితో గలసిన యింద్రాధ
'ముని పూజసేయమే పుణ్యులార ? '
వరుసను గూతురౌ వాణిని గూడిన
బ్రహ్మ దేవుడు కాడె ప్రాజ్ఞులార ?
సప్తర్షి సతులసతో సంగమించిన మహే
శ్వరుని బూజింపమే సరసులారా ?
జారసమ్రాట్టు మురారికి గుడికట్టి
భజనలు సేయమే భక్తులార ?

నీతియట! ధర్మమట! నాకు నేర్పెదరట!
కాటికిన్ గాళ్ళు సాచిన ఖలుడవయ్య.
గోమలిన్ గట్టుకొని గొంతుగోసినాడ!
తప్పు వాయది గాని యీ తరుణి దానె?
సుద్దు లేటికి? పొండయా పెద్దలారా!

ఓయీ! ఔచిత్య మెఱుంగని యవివేకపుకవి యెవ్వడైన నేను ఇంద్రునిసన్నిధికి లేగపుడే బోతినని యు, జారిణియైన భార్యను మరల నాయింటికి దెచ్చుకొనుట యత్నించి ననియు, నాదిగాగల పుక్కిటిపురాణము గల్పించిన గల్పితముగాక. నాయింటికి నేనేకర్తను. నాతార యొనర్చిన యపరాధమునకు నేనేపరిహర్తను. తారా చంద్రులారా! పడుచుదనపుమదోన్మాదమున నొడలెరుంగక యొనరించిన మీదుడుకుతనమ్ము నిక్కముగా క్షమించదగినది కాని, ఇదిలోకమే! లోకమనగా విపరీతనీతిదాహముతో నాల్కలుసాచి గోండ్రించుచున్న భయంకర వ్యాఘ్రము! దీని యాకలి నుపశమింప జేయుటకై మీఇరువురనిప్పుడే బలియొసంగుచున్నాడ. ఓసీ తారా! ఓరీ చంద్రా!

గీ. వాక్కునైపై నాకు సత్యంబు పలుకునేని,
మంత్రములు నాకు వశముతై మసలునేని,
చంద్ర! మసియయి చేరుమా చంద్రునందు!
తార! భస్మమై కలిసిపో తార లందు!

(బృహస్పతి మంత్రోదకములు చల్లగా, మంటలు బయలుదేరుతయవి
ఆమంటల్లో తారాచంద్రులు భస్మమైపోతారు.)

ఓయీ శుక్రా! ఓరీ నారద! తారాచంద్రుల నీవిధముగా శిక్షించి నందుకై మీకనులు చల్లబడి యుండవచ్చు. సర్వప్రపంచమును సంతృప్తిపడియుండవచ్చు కాని ఈదుష్టునకుమాత్రము తృప్తిలేదు. ఏలయన ఈ దురంతమునకెల్ల మూల కారణము నా లాలసత్వము—నాక్రూర కిరాతకత్వము! కాటికి కాళ్ళుసాచియున్న బెంబ్లాడ నాశించు నోవృద్ధులారా! నా రోదనము నాలింపుడు!

సీ. లేవలేకుండియు నావలె పడుచుల
పెండ్లాడునట్టి పాపిష్ఠులార!
ఆ భార్య వెలిచవి నాసింప గొంప ము
న్గినయట్లు ఘోషించ సనదలార!
వయసును బంధింప బగ్గము లుండునే?
పకృతిని అరికట్ట బ్రహ్మవశమె?
తప్పు నాయదియైన తారను దండించి
లోకమ్ము కొరకు నే లోభపడితి!
వృద్ధునై పెండ్లియాడి, యీ వెలది గొంతు
కోసినట్టి పాతక మింక మాసిపోవ,
కానలన్ జొచ్చి కఠినకర్కశ తపమ్ము
సేయువాడ! ప్రపంచము రోయువాడ!
తగదు! వృద్ధవివాహమ్ము తగదు! తగదు!

(నిష్క్రమణం)

శుక్ర- నారదా! నీకును నాకుకూడ చక్కని శృంగభంగ మైనది సుమా. అయిన నేమి? బృహస్పతి నేడునిక్కముగా సకలవిద్యా వాచస్పతివలె భాషించినాడు అతడు నాకు ఘోరశత్రువే యగుగాక — అతని సద్వర్తనము నన్ను ముగ్ధుని గావించినది. దేవగురూ! నీకు నాహృదయపూర్వక ప్రణామములు. బృహస్పతీ నీకీర్తి చిరంజీవియై నీవర్తనము సకలలోకాదర్శ ప్రాయమై విలసిల్లుగాక.

నారద- తథాస్తు! తదాస్తు! తథాస్తు.

మంగళగీతం (12)

తారాశశాంకం సంపూర్ణం.



# తారాశశాంకం పాటలు

## అనుబంధము 1

కోరస్— సుఖముగా పోయి రావోయీ !
చంద్రా ! పోయి రావోయీ !

అనసూయ—మాతా పితల మది రంజిల్ల
సకలాగమములు సాంగముగా,
చదివి రావోయీ ! చంద్రా !
చదివి రావోయీ !

అత్రి —గురువే తండ్రి, గురుసతి మాతా
అనయము వారల
అడుగులు కొలచి
తలలో నాలుకవలె చరియించి
పెద్దవాడనై పేరు వహించి
వేగ రావోయీ ! చంద్రా !
వేగ రావోయీ !

చంద్రుడు —తల్లి దండ్రులారా ! మీ
తనయుడనై నే జననమునొంది
కానిపనులకై కాల్ దువ్వుదునే
తీర్చుకొందు ననుగన్న ఋణమును
దీవనలిడి యిక బనుపరే

## అనుబంధము 2

భవానీ ! దయగనవే జననీ!...
సరసమృదువాణీ ! సురవరసుత !
పావని హేకళ్యాణీ ! భవానీ ! ...
మా పడతులకు నీ పదసేవ
యొకతైగా భవసాగర నావ
ఆది మహామాత ! హైమావతీ!
సారహీన సంసార తరణీ !
జీవతతికి జీవన మీవే

అగణిత కలకు సదాగతి నీవే
ప్రాజ్ఞ నైకోవే క్షామారీ!
మోహినీ! గిరిజా! వరపాణీ!
పాహిజననీ! ప్రపూత చరణి!
జయతు జననీ! జనోప కరణీ!
జయజయ ఈశానీ! జయతు హే
జన్మ జన్మ దురితౌఘ నివారీ!...

అనుబంధము 3

రావోయీ రావోయీ!
రావోయి చంద్రా!...
చిమ్మచీకటులెల్ల చెదరి విడబాసె
తారా మనోవీధి చంద్రికలు గాసె...
నిర్మలానందమున నీవు నేను గూడి
నేలాల నింగిలో మేఘాల తెరచాటు
ఆటలే యాడుచు పాటలే పాడుచు
హాయిగా దోబూచు లాడుకొందామా
రావోయి రావోయి...

అనుబంధము 4

చంద్ర —తగదు పో నీకిది శాంతా!
తగవాడగ దగునా! నాతో
తగవాడగ దగునా
సఖి నీవనుచు సరసను జేర
మోసము సేయుట న్యాయమా!
శాంత —హా! చాలురా! సరసము లేల
ఈ లీలా!
చంద్ర— జాణతనము మాను మాను
శాంత— జాణవు నీవె చతురుడ వీవె

చంద్ర —నాదు లేడిని గైకొన లేదా
ఎట దాచితివో తెలుపగ రాదా
శాంత —ఇంత లేసి కనులుండగ లేదా
ఎందు గలదో యెరుగ లేవా

అనుబంధము 5

శాంత —భ్రమరీ !
వ్రాలిన పూవుపై వ్రాల నదియేమె ?
ఆనిన పూవుల ఆన వదియేమే !
చంద్ర — వేనవేలు పూలు కలుగ
భ్రమరి కేమి లోపమా !
శాంత — ఇంత నీతి రహితమా
ఇంత హీనమా
చంద్ర — ప్రేమ కేమి రీతి
ప్రేమ కేమి భీతి
ప్రేమ కేమి నీతి
ప్రేమ కేమి జాతి

అనుబంధము 6

శాంత — భ్రమరీ !
వ్రాలిన పూవుపై వ్రాల వదియేమే
ఆనిన పూవుల ఆన వదియేమే ?
ప్రేమలేని యీ జీవన మేల ?
చంద్ర — ప్రేమయె జీవన లీల
శాంత — పూవు చెవిలో భ్రమరి చేరి
పలుకు పలుకే—
చంద్ర — ప్రేమ !
శాంత } — ప్రేమయెగా జీవనము
చంద్ర } — ప్రేమయెగా పావనము

## అనుబంధము 7

శాంత — మేత తెచ్చాను తినండోయ్!
నా కోడెల్లారా ! మేత తెచ్చాను తినండోయ్!
తినండి గడ్డి! తినండి మేత !
మీలాటి కోడెలుంటే
ఆనందం ! ఆనందం !
ఆనందం ! బ్రహ్మానందం!
చల్ ! చల్! చల్!

లంబు } — బండిలాగలేము నీకు
జంబు } దండ మమ్మా
బాధ పెట్టకుండ మమ్మ
విడుమమ్మా !

శాంత — ఓహో చాలు ! చల్! చల్! చల్!

లంబు } — అయ్యయ్యయ్యో !
జంబు } అమ్మమ్మమ్మ !
అన్నన్నన్నన్నన్నా

## అనుబంధము 8

కృతార్థనైతిని హే దేవా !—
తావక అమోఘ దర్శనమున...
తరించెగా ఆశ్రమము
మానోములు ఫలియించెనుగా .
సురశేఖరా ! —

## అనుబంధము 9

ఆనంద సమయమిదే !—
నాథుని తోడ నాకము జూడ
పోయెదగా ఈ వేళ !—

— — —

మానసవీధి ఖేదముతీరె !
మోదము మీరె ?—

### అనుబంధము 10

బృహ— సెలవు నొసగి వేగ బనుపుడీ !
కోరస్— రయంబుగా
సుఖంబుగా
శుభంబుగా
బృహ— అతిథి సేవ సేయుమా
ఆర్తజనుల నరయుమా
దయా ధర్మ నిరతవై
సదా చరింపుమా

### అనుబంధము 11

తార— జీవన మిదేగదా సఖుడా !...
ఆహా ! అహాహా ! హాహాహా
అఅఅఅఅహాహా !
తీరె నాదు కోరిక
ధన్యనైతినిగా ఈ వేళ
అహాహా ! అహాహా !—
చంద్ర— ప్రేమ లతిక పూలుపూసె
మోదమా[illegible]
తార— రార నా ప్రణయసఖా !
రార నా మోహనా !



### అనుబంధము 12

జయ జయ మహేశ్వరి !
భవానీ ! భవభయ నివారిణి !
మాతా !... ...
శ్రీ రాజరాజేశ్వరీ
సమాజ పోషిణి మాతా!...

---